ఆంధ్రగ్రంథమాల—౩.

# త్యాగరాజస్వామి చరిత్రము

---



గ్రంథకర్త

పసుమర్తి కృష్ణమూర్తిశాస్త్రి

ప్రకాశకుడు

కాశీనాథుని నాగేశ్వరరావు

౧౯౨౮] [రు. ౦-౧౦-౦.

# ప్రస్తావన

శ్లో. ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదామ్,
లోకాభిరామం శ్రీరామం భూయో భూయోనమామ్యహమ్.

శ్రీ రామభక్తుడు త్యాగరాజస్వామి మహానుభావుడు లోకారాధ్యుడు. భగవద్దత్తములైన యవకాశములను సంసారప్రవృత్తియందు స్వప్రయోజనములకు గాక భగవత్కైంకర్యమునకు వినియోగింపగల మానవులు మహానుభావులు. భగవద్దత్తములైన సంపదలు, జ్ఞానము, ప్రజ్ఞ స్వోదరపోషణార్థము వినియోగపడునపుడు పరిమితములై పురుషార్థమును సాధించుటకు నిరుపయోగము లగుచున్నవి; భగవత్కైంకర్యమునకు వినియోగపడునపుడు అఖండములై పురుషార్థసిద్ధికి సాధనంబులగుచున్నవి. మానవులలక్ష్యము ఇంద్రియగోచరంబు లగు భౌతికపదార్థారాధనమునందు లగ్నమగునపుడు పురుషార్థము సంకుచితమై దుఃఖభాజనం బగుచున్నది; అతీంద్రియమైన పరమార్థమునందు లగ్నమగునపుడు విశ్వవ్యాప్తమై సుఖసాధకం బగుచున్నది. ప్రజ్ఞాధను లైన కవులు, గాయకులు, శిల్పులు, వీరులు, తత్త్వజ్ఞులు,

భక్తులు దైవసంపన్నులై తాము తరించి లోకమును తరింపజేయుచున్నారు.

దైవసంపన్నులైన మహానుభావులు పరమపూజ్యులై ధర్మమార్గమును లోకమునకు ఉపదేశించుచున్నారు. దైవసంపన్నులు మహానిర్మాతలై లోక కల్యాణమునకు కారకులగుచున్నారు. దైవసంపన్నులు అనన్య భక్తితత్పరులై యిష్టదేవతారాధనమును జేయుచు దైవ సాక్షాత్కారమును బొందుచున్నారు. భావసంశుద్ధి గల మహానుభావులకు విశ్వమునందంతటను భౌతికసంపద లందు పరమేశ్వరవిలాసములు ప్రత్యక్షమగుచుండును. కవులకావ్యములు, గాయకులగానములు, శిల్పుల శిల్పములు, కళాభిజ్ఞుల కళానిర్మాణములు పరమార్థమును కనుగొనుటకు వినియోగపడుచుండును. శ్రీరామభక్తుడైన త్యాగరాజు రామమయమైన జగమునందంతటను శ్రీరాముని కనుగొని, రామవిలాసములను సందర్శించి, శ్రీరామవైభవమును సంకీర్తనముచేసి బ్రహ్మానందభరితుడై బ్రహ్మానందానుభవమును శ్రీరామభక్తులకు ప్రత్యక్షము చేయగలిగెను.

ప. నినువినా నామ దెందు
నిల్వదే శ్రీహరిహరి

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# పీఠిక

---

శ్లో. జన్తూనాం నరజన్మ దుర్లభ మతః పుంస్త్వం తతో విప్రతా
తస్మా ద్వైదిక ధర్మమార్గపరతా విద్వత్త్వ మస్మాత్పరమ్;
ఆత్మానాత్మవివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితిః
ముక్తి ర్నో శతజన్మకోటిసుకృతైః పుణ్యై ర్వినా లభ్యతే.

శ్రీమత్త్యాగరాజస్వామి చరితమును యీ వైదికగ్రంథమును, రసికులగు లౌకికులకు సమర్పించుకొనుచున్నాను. చరిత్రమనఁగా "నాతఁ డేనాఁడు పుట్టెను? ఎవరికిఁ బుట్టెను? ఏయూరఁ బుట్టెను? ఎఱ్ఱనివాఁడా? నల్లనివాఁడా?" యను నిట్టిమాటలను వ్రాయుటకాదు. అయ్యది వట్టికాకదన్త పరిగణనము. "శ్రీమత్కాకర్ల నగరాజబ్రహ్మమను నాంధ్రబ్రాహ్మణుఁడు గోదావరీతీర భూములను విడచి చోళరాజ్యమునంగల తిరువైయూరను గ్రామముఁ జేరుకొని యచ్చోట స్థిరనివాస మేర్పరుచుకొనెను. ఆతని కుమారుఁడు రామబ్రహ్మము. ఆరామబ్రహ్మముగారి రెండవ కుమారుఁడే త్యాగయ్యగారు. 1764 వ సంవత్సరప్రాంతమునఁ బుట్టినవాఁడు" అను నిట్టి

నాలుగుమాటలు సెప్పుటకుఁగా దీప్రారంభము. "మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అను మాట ను ముందుగఁ దలంపుఁడు. సృష్టిలో నుత్తమస్థానమున నున్న యీనరుని మన సెట్లుత్రిప్పుచున్నది? వానిముక్తికిఁ గాని బంధముకుఁగాని యెట్లు తోడ్పడుచున్నది? అట్టికార్యములయందు దీనిపరివర్తనము లెట్టు లుండినవి? యను నిట్టిప్రశ్నలకు సమాధానమువ్రాయుట యచ్చఁ పుఁజరిత్ర యని పెద్దలయాశయము.

ఇట్టి నాయత్నమునందు నేను గృతకృత్యుఁడ నైతినని యెన్నఁడును దలఁపను. నేను శ్రీమంతుఁ డగు పోతనమంత్రినిగాను. అయినను సంగీతసాహిత్యములందు వలపుగలిఁగి పెద్దలపాదసేవఁజేసి, వారి దయవలననుఁ బూర్వపుణ్యవశంబునను, ఆరెంటియం దొక లేశమాత్ర పరిజ్ఞానముం బొందితిని. శ్రీస్వాములవారి కీర్తనములే నా బుద్ధికి వేదములు. శ్రోత్రియబుద్ధితో వీనిని బాడుకొను నపు డీ మహాపురుషుఁడు, త్రికాల సంస్మరణీయుఁ డని నమ్మికొంటిని.

భక్తి, విజ్ఞానము, వైరాగ్యము, అవ్యాజప్రేమ, శమాదిగుణములుగలవాఁ డీతఁడనుట యటుండగా సహజ పాండిత్యముగల మహాకవియగు పోతనమంత్రికిఁ దరువాత

సకలగుణసమగ్రుఁడై బ్రహ్మీభవించిన యీపురుషోత్తముని త్రిమూర్త్యాత్మకుఁడగు సూర్యభగవానుతో సరిచేసి యీపొత్తమునకు భాస్వరమను నామాంతరముం గల్పించినాను. రాగతాళసమన్వితమై యుంటఁ గాబోఁలు నీయుత్తమకవిత త్రోసిరాజు చెప్పఁబడుచున్నది; కాఁబట్టి రమారమిపేఁబదిమైదుకీర్తనలనిందుఁ జేరిచి,యీమహాత్ముఁ డింతటివాఁడని యెఱుఁగఁజెప్పుటకే యీపుస్తకము వ్రాసితిని గాని నేనుగూడ నొకకవినని విఱ్ఱవీఁగుటకుఁ గాదు.

నా యడుతబత్తికి సంగీతసాహిత్యరసాత్మక యగు భారతి ముదమొందినది యనియే నాపరమవిశ్వాసము. అటులు గాకున్న శ్రీమంతులగు నాగేశ్వరరావుపంతులు గారిని నిరుపేదనగు నేను సమీపింపఁగల్గుటయు, నీకన్యక లోకయాత్రకుఁ గడంగుటయు సమకూడి యుండదు. దేశోద్ధరణమే జీవితసూత్రముగానున్న యిట్టి మహాశయుల ఋణము నావంటి పేదవాని నమస్కారముల తోఁ దీఱదు: దేశీయులందఱు వారి ప్రారంభములకుఁ దోడయినపుడే తీరును.

చిత్తమున కవ్యాజప్రేమఁ బుట్టించి దాని నున్నత స్థానమునకుఁ గొనిపోవుశక్తి గానమునకుఁ గలదు. ఇట్టి యుత్తమవిద్య నిరాదరింపఁబడుట దుస్సహముగదా? తక్కిన విద్యలవలె నిదియుఁ గళాశాలలయం దుచిత

గౌరవము నొందియుండుట లేదే! దీనినిఁగూడఁ గళా
శాలావిద్యలలో నొకటిగ నేనాఁడు నెలకొల్పుదురో
యానాఁడే మన బాధ్యత తీరునుగాని సంగీతపాఠకులకు
గచ్చేరీలఁజేయించి డబ్బిచ్చుటతోఁ దీఱదు. రామకీర్తనల
"యతివిశ్రమసద్భక్తినియతి ద్రాక్షారసనవరసయుతము"
లగు నీరామకీర్తనల హాయిగఁబాడుచు మన బాలకుల
కళాశాలలకుఁ బోయివచ్చుచుండిననాఁడే ఈ యాంధ్ర
రాజ్యలక్ష్మి మనకు వశయగును.

ఇఁక నీగ్రంథము వ్రాయుటయం దనేకుల సహా
యము నొందినాను. వారియందు ముఖ్యసంస్మరణీయుల
శతారయ్యాయు, న్యాయపతి పట్టాభిరామయ్యాయు
మ-రా-శ్రీ ఊటుకూరి గోపాలరావు పంతులుగారును.

ఇట్టి యుదాత్తకథావస్తుప్రదర్శనమునం దల్పబుద్ధి
నగు నే ననేకములు దోసముల నొనర్చుట వింత కాదు
అయినను వేత్తలగుభాగవతాగ్రణులు దయతో వానిఁ
బాటింపరను నమ్మకము నాకు లేకపోలేదు. కాఁబట్టి
యావిషయమున విశేషము వ్రాయలేదు.

గానవిలాసము,
1-7-26.

ఇట్లు దాసుఁడు,
పసుమర్తి కృష్ణమూర్తి.

---

నీయనఘుఁడే గణ్యుఁడనియు నన్నిఁటికంటె ముఖ్యముగ గానవిషయమున నారదాంశ గలవాఁడనియు నా బుద్ధికి గోచరించినది.

ఈభూమికాముఖమునఁగల శ్లోకమునందలి యంశము లీ యనఘునియందు లెస్సగా నిమిడియున్నవి.

సంగీతసాహిత్యములయం దప్రతిమానప్రతిభ గలిగియు నీ బ్రాహ్మణుఁ డక్కాలమునాఁటి గాయకులవలె నేదో యొకసంస్థానముఁ గనిపెట్టుకొని, తత్ప్రభుకటాక్షలబ్ధికై "తళుకుబెళుకుకులుకుగలమిటారుల" వర్ణించి యానాయకులకుఁ దార్ఢ్యటయందుఁ దనసంగీతసాహిత్యనైపుణిని వినిమోగించి "పురంబులువాహనంబులుఁ, సొమ్ములు కొన్ని పుచ్చుకొని చొక్కి శరీరమువాసి కాలుచే, సమ్మెట పోటులంబడక సమ్మతితో" శ్రీరామచంద్రుసేవయందే ఆయుత్తమవిద్యల వినిమోగింప నిశ్చయించుకొనెను. కాఁబట్టియె తాతతండ్రులవలెఁ దానును యాయవార దీక్షాపరుఁ డయ్యెను. ఈతృప్తినిఁబట్టి యా బ్రాహ్మణోత్తమునకుఁ గల యీశ్వరవిశ్వాస మెంతయో తెలిసికొందు. ఇంతటి విశ్వాసమే యచంచలభక్తిజనక మైనది. ఈశ్వరునియెడ నిర్మలమైన ప్రేమఁ గొంట కీభక్తిమే మూలము.

ఈభక్తి యీతనియం దెటులు పరిణమించినదో చూడుఁడు. శ్రీరామసేవదప్ప మరియొకపని నాతనిచేతఁ జేయింపలేదు, శ్రీరామపీఠమును వర్ణించుట కొకపాట; దానిని సింగారించుట కొకపాట; క్షీరనైవేద్యమున కొక పాట; విడియ మిచ్చుట కొకపాట; అర్చనకుఁ గావల సిన తులసీదళములను, సరసీరుహాదిపుష్పములను గుఱించి యొకపాట :

ఇట్టి భక్తికి జప్యేశుఁ డడ్డము దగిలెను; ఆరామ పీఠముఁ గావేరిలోఁ బారవైచెను. అంతటినుండియు భక్తు నకు హృదయమే శ్రీరామాలయ మైనది. ఇపుడు చేయు రామపూజకుఁ దులసీదళములు మొదలగువాని యక్కఱలేదు; " వరశివరామనామకుసుమములే " పనికి వచ్చినవి. విషయసుఖావాప్తికై సర్వథా పరువులువారు చిత్తమర్కటము మువ్పాతిక కట్టువడిన దనుటయే; కాని, తంజావూరు మహారాజుగారి యాహ్వానము చెవిఁ బడఁ గనే యించుక సంచలించినది. "విషయతటాకమునఁ బడి మునుఁగక తప్పిబ్రతికిపోవఁ దరమా!" అయినను స్థిత ప్రజ్ఞుఁడు కావునఁ దత్త్వబోధఁ జేసి చిత్తమును గెలిచి నాఁడు; మఱియు రానురాను "ఉండేదే రాముఁ డొకఁ" డని పాడినాఁడు. మొదట మొదట దశరథరాజకుమారుఁ డైన రామచంద్రుఁడు, సర్వలోకాభిరాముఁడై చివరకు

"ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" యనఁదగి రామబ్రహ్మమై నిలచినాఁడు : అనఁగా ద్వైతము, విశిష్టాద్వైతమై కడకు శుద్ధాద్వైతముగాఁ బరిణమించినది. కామజేతయే తారకబ్రహ్మోపాసనాధికారియగును కదా!

అది యటులుండ నిఁక సంగీతసాహిత్యప్రమేయమునకు వత్తము.

ఈమహాత్ముని జీవితకాలమునం దీరెండునీతని యుచ్ఛ్వాసనిశ్వాసములయందుఁగూడఁ బ్రకాశమానములగుచుండినవి. ఇందు ముఖ్యముగా మన మెఱుఁగవలసిన యంశ మొకటియున్నది. సంగీతమనఁగా సరిగమలజంజాటము కాదనియు, సాహిత్యమనఁగా వ్యాకరణసూత్రములతోఁ గొట్లాటకాదనియు.

పరమతృప్తి నొందియుండిన చిత్తమే కామాదివివర్జితమై, యఖండానందమునకు నెలవై యుండును. ఆయవస్థలో భక్తుఁడు, ఈశ్వరవిలాసమును, సృష్టి రహస్యములను, జంతుతత్త్వములను గనుంగొనుచుఁ బట్టఁజాలని సంతోషముతోఁ బాడును. ఈపాటయే పాటయు, నిందున్నమాటలే మాటలును, తొల్లింటిమహర్షు లొనరించినది ఈగానమే—వేదనామకమైనది. ఇట్టిదానియందుఁగలనాదవిశేషము, పదలాలిత్యము, నర్థపుష్టి, భావౌదార్యము

మొదలగు నంశములఁ దెలియఁజేయుటకు వ్యాఖ్యాత యక్కఱలేదు. మన త్యాగరాజస్వాములవారి కీర్తనలు నట్టివే. "రామా! నీయెడఁ బ్రేమ రహితులకు నామరుచి తెలియునా; కామినీవేషధారికి సాధ్వీనడత లేమైన తెలుసునా" "సోమిదమ్మ సొగసుకాండ్రఁ గోరితే సోమయాజి స్వర్గస్థుఁడౌనా, కామక్రోధులు తపము సల్పితే కల్గునా ముక్తి" యను నిట్టిముద్దుమాటలకు వ్యాఖ్యాతయేల? ఈ లోకములోని వారల సంబోధించి యీమాట లాభక్తవరుఁ డాడలేదు! దైవచూడామణియగు శ్రీరామచంద్రునితో నాడినాఁడు. ఇటులాడించినవాఁ డారాముఁడే. "పలికెడిది భాగవతము; పలికించెడివాఁడు రామభద్రుఁడు" ఇట్టియెడ నప్పకవి యొప్పుకొనఁడట!—పీడపోయినది.

ఈమహాకవి భక్తిజ్ఞానవైరాగ్యములతోఁ దన కీర్తనలఁ బాడినాఁడు. శృంగారాదులు దత్తదవస్థావశములై యున్నవి. "నీదు పలుకే పలుకురా, రామ! నీదు కులుకే కులుకురా, రామా!" యనుమాటలను "ఎదుట నిలచితే నీయబ్బసొమ్మేమి పోయెరా" యను మాటలను జూడుఁడు: ఒకదానియందు సింగారపుఁ దళుకు; వేఱొక దానియందుఁ గోపపుఁ గెంపు. ఇటులెన్నియో విశేషముల నీకృతులయందుఁ జూడవచ్చును.

శ్రీరస్తు

# త్యాగరాజస్వామి చరిత్రము

## ఆ ది భా గ ము

---

శ్లో. శ్రీవాణీరమణః కులే సువిమలే
విష్ణు ర్యశోవిభ్రమే
త్యాగే కామ యమ స్తథా హ్యనుపమో
యన్మూర్తి రేవం త్రిధా;
నూనం పూర్ణకళానిధి స్సువిలస
త్కాకర్లవంశాగ్రణీ
స్సశ్శ్రీభూతలభాస్వరో విజయతే
శ్రీ త్యాగరాజో గురుః.

శా. ధాత్రిన్ భాస్వరనామకంబు విలస
త్త్యాగక్షమానాథ చా
రిత్రం బార్య మనస్సరోభవ వసు
శ్రీదాయకంబై ప్రభా

మాత్రంబై హితయాత్రఁ జేసి బుధస
న్మానంబు నొందంగ నా
మిత్రున్ విష్ణుపదప్రదీపకమణిన్
మేల్కొంచు నే నెంచెదన్.

ఉ. చయ్యన భక్తితోడ శిర
సా వహియించి మదాజ్ఞ నెప్పుడున్
నెయ్యము నించి యెల్లెడల
నీడవలెం జరియించి హాయిగాఁ
దియ్యని పాటఁ బాడి ననుఁ
దేర్చుచునుండెడునట్టి మా శతా
రయ్యకు శాశ్వతామృతప
దానుభవంబులు గల్గుఁగావుతన్.

శా. భక్తిజ్ఞానవిరక్తులే త్రిదశలై
వాటిల్ల భాస్వత్సుధీ
శక్తిస్థావరుఁడై పరార్థకృతి దీ
క్షాదక్షుఁడై యింద్రియో
న్మత్తిన్ ముక్తిని మూటగట్టిన మహా
త్మ్యుం దెల్పు నీచోటఁ ద

తూస్సూక్తిస్యందమరందధారలు బుధ
స్తోమంబు మెప్పించుతన్.

శా. విశ్వాత్ముండును విశ్వకర్తయుఁ ద్రయీ
వేద్యుం డోకండుండుఁ ద
ద్విశ్వాసంబును గల్గి వెండియును సం
విచ్ఛక్తు లేపారఁగా
శశ్వద్భక్తిని జేయుమానవుల స
చ్చారిత్రలేకాదె స
ప్తాశ్వగ్లావుడు మండలంబులకుఁ బ
ర్యంతంబులై యుండెడిన్.

శా. లేరే బోద్ధలు తర్కకర్కశతర
క్లిష్టాత్మకుల్ నాస్తికా
చారుల్ దైవవిరోధపద్య లోకపో
చంజేతురే! చచ్చినం
బేరైనంగలదే ప్రయోజనము లే
మింజేసి? గీర్వాహకుల్
గారే హారవిహారమన్మథసుఖా
కాంతాపరోజ్జీవనుల్.

ఉ. నిండి సభాస్థలంబుల మ
నీషులు జేజెలువెట్టఁ బండితా
ఖండలుఁడై త్రిశుద్ధిగ శు
కప్రతిభన్ రఘునాథ సత్కథా
కాండములందు సుస్వర వి
కాసము వెల్లువఁబారుచుండ ధీ
రుండయి కేవలామృతప
రుండయి పాడె నజాండమండలిన్.

కం. వాని కథావిధమంతయు
ధీనిధులకుఁ గేలుమోడ్చి తెలుపుమనుచు నా
మానసననచరమే ఘుటు
మానక పురికొల్పెమాటిమాటికి నన్నున్.

చం. పరగుదు, రెందఱో విపుల
భావవిదుల్ నవశబ్దశాసనుల్
సరసవచస్కులైన కవి
చంద్రులు మాధవపాదపద్మబం
భరులు త్రికాలవంద్యులీక
మా ద్రుగకించనుఁ డెందు వారికిం

బురుడు? మయూరి నాదు నను
పూరుడుపిట్టకు సాటియాదునో!

మ. అవధానుల్ శతథా తిరుప్పతులు వే
దాఖ్యాన్వవాయు ల్మహా
కవు లార్యు ల్వసురాయ రత్నకవు లిం
కా ఆంధ్రవల్మీకసం
భవులున్ ధర్మవరాన్వాయు ల్మరియు శ్రీ
పాదాఖ్యగోత్రోద్భవుల్
వివరింపంగల రెందఱెందఱో యిటు
ల్వీశేశ లింగాదులున్.

కం. సరసుఁడు, కవి, గాయకుఁడున్
వర గీర్వాణాంధ్ర హూణభాషావిదుఁడున్
హరినాగభూషణాఖ్యుఁడు
హరిదాసజనాగ్రగణ్యుఁ డారయ నింకన్.

కం. నారాయణనామాక్షర
పారాయణపరులు లోకబంధువు లగు మా
నారాయణదాసాదులు
పారంగమితాఖిలార్థపారావారుల్.

గీ. వారి కెందునుఁ బోలనివాఁడ నైన
ధీరచరితము వ్రాయఁగఁ దివురుచుంటిఁ
గారణం బల్ల హృదయమర్కటమె యంటి
భారమంతయు దైవముపైన విడచి.

మ. సరసంబేన్ రసికాళి కింపగును ని
స్సారంబె మైపోయినం
బరగుంబో కుకవిత్వలక్ష్యమయి యే
పాటైన నాభాగ్యమే
హరినామస్తుతి సేయు కావ్య మది య
ర్థాలంక్రియాశూన్యమ
య్యు రహిన్ మించునటంచుఁ జెప్పరొకొ యా
ర్యు లున్నన్ని నిర్భీకులై.

వ. కావున ధైర్యమూని యి క్కార్యమునకుఁ
బూనితి. నన్ను మన్నింపుఁ డని మహాత్ములఁ
బ్రార్థించి నాకథ నుపక్రమించెద.

కం. దండిమగల్ నిండుసిరుల్
బండారములై చెలంగ భాసిల్లెడు భూ
మండలమున మండలముల
మండనమై తనరు చోళమండలమందున్.

కం. అంచితబుద్ధులు ద్రావిడ
పంచాసను లనఘులు తిరువైయ్యా రనఁగా
మించి యశోవిభవంబునఁ
బంచనదక్షేత్ర మొండు పరఁగుచునుండున్.

చం. హరిపదనీరజాంతర సు
ధాంధసుఁడై యతిమానుషక్రియా
కరణసమర్థుఁడై సుగుణ
ఘట్టిత శోభనచిత్త సద్మఁడౌ
పురుషవరేణ్యుఁ డీధరణిఁ
బుట్టినచోటు పవిత్రతీర్థమై
పరగును బూరుషార్థచయ
పక్వఫలానతపారిజాతమై.

మ. కలఁ డచ్చోట మహాత్ముఁ డొక్కరుఁడు శ్రీ
కాకర్లవంశాబ్ధి శీ
తల తేజోనిధి భూతలామరకులో
త్తంసుండు రాజత్కళా
కలితుం డార్యనుతుండు రామభజనా
కాంతాపరుండున్ విని

ర్మలచారిత్రుఁడు సాధుజీవనుఁడు రా
మబ్రహ్మమన్వేరిటన్.

శా. ఘోరాంహోజ్వాలనప్రశాన్తికరమౌ
గోదావరీవాహినీ
తీరస్ఫీతలవాసుఁడయ్యుఁ దొలుతన్
ధీరుండు దారిద్ర్యదు
ర్వారక్లేశము నోర్వఁజాలక కుటుం
బం బెత్తికొం చొక్కటం
జారెం బూర్వుఁడొకండు మున్ను నగరా
జబ్రహ్మమన్వేరిటన్.

కం. బ్రహ్మవిదుండై వెండియు
బ్రహ్మణ్యవరేణ్యుఁ డనఁగఁబడుచుండిన యా
బ్రాహ్మణునకై యారామ
బ్రహ్మము నిజవంశవనధి వరలఁగఁ బుట్టెన్.

చ. ఒదవిన నూత్నయౌవనము
నుద్ధిషణా బలయుక్తి శక్తులం
జదివిన శాస్త్రసంచయము
స్వర్ణమునందునఁ బద్మరాగముం

బోదివినయట్టు లుండె బుధ
పూజితజీవనునందు వాసనే
కొదవ సదాముదంబు లోలు
కుంగద ఆయదియే జనించినన్.

ఉ. కాంతలతాంతసౌరభము
గ్రాలదొకో యటువంటి చోగుణా
క్రాంతనిశాంతదీధితివి
కాన, యపాంసుల లోకవంద్యయా
శాంతయశోవిహారసుగు
ణాఢ్య యనం దనరారునట్టి యా
శాంత సుశాంతచిత్త సహ
చారిణియై యొనగూఁడువానికిన్.

చ. సతమును నిష్కళంకమును
సాధువునై తనరారు ప్రేమ మే
యతివకు నాత్మవల్లభుని
యం దుదయించునో యామె కేకదా
పతియనఁ దద్వ్రతంబన ధ్రు
వంబగు నర్థము దోఁచు వెండియున్

క్షితి నటువంటి యాపె కర
చేత నె కల్గుచునుండు ముక్తియున్.

మ. కనరా దేదియుఁ గారణంబు విధియే
కానోపుఁ గాకున్న మో
హానమంత్ర ప్రతిభావిశేషమునెనో!
యజ్ఞాత్ము లొక్కొక్కటం
దనువుల్ ధారలఁబోసి స్వర్గసుఖ సం
ధానంబులం జేసి తా
రను వర్షంబుల వర్షముల్ గురియఁగా
నాత్మేశులం బ్రోతురే.

చ. అనుగుణరూపయుక్తులయి
యాతత నీతిపథానురక్తులై
తనరుచునున్న దానిఁ దిని
తద్దయుఁ దృప్తినిఁ బొంది సౌఖ్యజీ
వనులయియున్న దంపతుల
భాగ్యము సంతతి వారికేల యీ
ధనకనకాది వస్తుసము
దాయము దారుణ పాపపావకేం

ధన మది చెంతనున్న గల
దా సుఖ మెవ్వరికైన ధాత్రిలో.

మ. కలదుర్గా లేదు సుఖంబు నాంబరగు నీ
గార్హస్థ్యమన్ మింటిలోఁ
గలయం బర్విన యట్టి జవ్వనపుఁ గ్రొ
క్కార్మబ్బు గుంపుల్ సదా
వలపుంబానకము ల్మనోహరముగా
వర్షించి పోషింపఁగా
దలపుం బైరు వికాసమొంది ఫలవం
తంబయ్యెఁగా వారికిన్.

ఉ. తంబుర మీటి భక్తిపర
తం బురవీథులలోనఁ బ్రాహ్మణుం
డంబర వీథిదాఁక నెగ
యం బరమోత్తమమైనయట్టి పీ
తాంబర నామకీర్తనము
హాయిగఁ జేయుచు యాయవార దీ
క్షం బచరించి తృప్తుఁడయి
క్రమ్మరి తీర్చుఁ గుటుంబభారమున్.

శా. భిక్షావందనశాలియైన గుణలో
భిన్ జీవితేశుం దనున్
సాక్షాదీశునిఁగాఁ దలంచి శుచియై
సంసేవలం జేయుచున్
దీక్షాతత్పరయై భజించి తనకున్
దేహంబు నర్పించుచో
లక్షల్సేయదె జాయ భూసురునకే
లా యేధనాపేక్షయున్.

మ. పతిసేవారతి శీలశౌచబుజుసం
భావంబు లత్యంత సం
గత సంవిద్బలమార్యధేయకలనా
కారంబు లేపార నె
వ్వతె సంసారమునం ద్రివిష్టపసుఖ
వ్యాప్తిం జెలంగించునో
సతిపే రామెకుఁ జెల్లుఁ దక్కొరులకో?
చాకింటిలో వేయఁగన్.

ఉ. శ్రీమతి తోయజాక్షులకు
శ్రీమతి పుట్టినయింటి కట్టులే

శ్రీమతి మెట్టినింటికిని
శ్రీమతి భర్తకు నిందునందునున్
శ్రీమతి ధర్మకర్మముల
శ్రీమతి నాఁబడఁ జెల్లుశాంతమే
శ్రీమతులార! శాంతలయి
శ్రీమతిశబ్దముఁ బెట్టుఁడీ తలన్.

ఉ. కామితసిద్ధిఁ జేసి కన
కంబునఁ బూజలఁ జేసి యాత్మ వి
శ్రామము బూది సేసికొని
సన్నలలో మెలఁగంగ నేర్చినన్
రాములు జీవితేశ్వరుల
రంజిలఁ జేయుచునుంట వింతమే?
లేమిడివేళఁ జూడవలె
లేమలలోని గుణాగుణంబులన్.

క. ఎంతే సంసారంబున
సంతుష్టస్వాంతనీరజాతులహా! శ్రీ,
శాంతారామ బ్రహ్మము
లంతటి సుకృతధను లెందునైననుఁ గలరే.

గీ. తమ పురాకృతపాపపుణ్యములు పండి
యలఘు ఫలముల నిచ్చెనో యనఁగ వార
లెలమిఁ గాంచిరి సుతుల జప్యేశుఁ డనఁగఁ
ద్యాగరాయఁ డనంగ నిద్దరిని మఱియు.

చ. ధరణి సమస్త సస్యసము
దాయవసుప్రదఁగా నొనర్చుచుం
బరగు మహానదుల్ నరుఁ డె
వండును జూడఁగ రానియట్టి భూ
ధరకుహారంబులం బొడమి
తద్దయు దేశములందుఁ బారునా
వెరవున నే, మహాత్ములును
బేదలయిందులఁ బల్లెటూళ్ల లో
నరయ జనింతు రాతతది
గంత యశోవిభవాభిరాములై.

క. తనయుల నుపనీతులఁగా
నొనరించి ధరాసుపర్వుఁ డుభయుల విద్యా
ధనపతులఁ జేయుతలఁపున
మునుకొని యధ్యాపనంబు మొదలిడె నంతన్.

క. “పూతమతం బడుగున౽ బడి
నీతిచెడి యనూనపటా మనీషాబలముల్
ప్రాతవడియున్న యిప్పుడ
జాతీయోన్నతులు గలుగ౽జాలునె మనకున్.

క. మత విద్యా గౌరవసం
యుతమై యేనాఁడు భారతోర్వీజన సం
తతి యలరు మరల నానా౽
డతులితసౌఖ్యములు దాని కబ్బెడు”ననుచున్.

ఉ. భూసురపుంగవుండు తన
పుత్రుల కాంధ్రము దేవభాషయున్
భాసుర సాంగవేదములు
బాగుగ నేర్పి సమస్తసద్గుణా
వాసుల౽ జేయనెంచి బహు
భంగుల౽ గష్టసముద్ర మీఁదుచున్
వేసట నొందుచుండె నిరు
పేద కదేకద బాధ యెన్న౽డున్.

వ. అట్టియెడ నా యిరువురు పుత్త్రులయందుం బెద్ద వాఁడు:

క. కడువడి విద్యాభ్యాసము
విడిచెడు నడవడికి లోఁగి విషయాసక్తిం
బడి వెడవెడ జప్యేశుఁడు
దుడుకై వారలకు మిగులదుఃఖముఁగూర్చెన్.

శా. శ్రీపీయూష సుధాంశుకల్పలతికా
చింతామణుల్ ధేనువున్
దీపింపన్ జనియించినట్టి కలశా
బ్ధిం గాలకూటం బటుల్
పాపాత్ముండు నిరర్థకుం డొకఁడు శు
భ్రశ్లోకభూషాంకితం
బై పేరెన్నికఁగన్న వంశమునఁ గ
ట్టా పుట్టుచుండుంగదా!

క. హాలాహలవిషగుళికన్
శూలాయుధపాణి కుతుకఁ జొన్పించిన యా
లీలను రామబ్రహ్మము
పాలసు జప్యేశు నడఁచిపట్టుచు నుండున్.

చ. వెడఁగు లెపో నిజాజ్ఞలను
వీనులఁ బెట్టకయున్న వారెపో

దుడుకుఁదనంబుఁగల్గి పలు
త్రోవలఁ ద్రొక్కుచునున్న వారెపో
కొడుకులు వారియందుఁ దమ
కుంగలప్రేమము తల్లిదండ్రులన్
విడువదు జన్మమధ్యమున
వేయివిధంబులఁ బ్రేంపఁ జూచినన్.

ఉ. రాజులు మెచ్చ సద్గుణ వి
రాజితుఁడై బుధలోకనిత్య నీ
రాజిత బుద్ధివైభవ ప
రాజిత గీష్పతియై నిరంతరాం
భోజదళాక్ష సంస్తవన
మోదితచిత్తుఁడు త్యాగరాజు రే
రాజటుపూర్ణుఁడై కళల
రంజిలి మోదముఁగూర్చె వారికిన్.

ఉ. కంటికి ఱెప్పవై మరియుఁ
గాలికిఁజెప్పయి పెద్దవారికిం,
బంటవలంతి చూలి మగ
వానికి బంటయి, యూరివారికిన్

జంట మొగంబు వేలుపయి
చక్కని దారిని బట్టి యెన్నఁడున్
గెంటక కూడఁబెట్టుకొనుఁ
గీరితి లిబ్బని వాఁడు నిచ్చలున్.

చ. గురుజన సేవ సాధుజన
గోష్ఠి శ్రుతిస్మృతి పాఠచాతురీ
పరత వివేకభక్తి ఋజుభావ
ముదాత్తుల కెందు నైజముల్
ధర నుదయించుచుందురు క
దా శుభకారణు లట్టి రార్యధ
ర్మరతమతుల్ సదాభువన
మానితబోధహితస్వరూపులై.

వ. రెండియు నుత్తమసాహితీవేత్తయైన యయ్యాస్తిక శిఖామణి,

క. "ఆతత సాహితితో సం
గీతం బానగూడెనేనిఁ గేవలభక్తిన్
సీతారామునిచరితము
గీతంబులఁ బాడి యెపుడుఁ గీర్తింతుఁగదా!

క. దుర్లభ మీమానవత; సు
దుర్లభ మందును సువాణి దొరికిన నదియున్
దుర్లభతమము కవిత్వము
స్వర్లోకంబేల దాన శక్తి కుదిరినన్.

వ. వెండియు,

క. మానవతా సద్వాగస
మానకవిత్వములతోడ మధురతరంబౌ
గాన మొనగూడియుండుట
శ్రీనాయక దేని బోల్చి చెప్పెదఁ జెపుమా.

వ. అని,

క. ధీనిధి యతఁ డిటులనుకొని
వీణాన్వయవార్ధి చంద్రు వేఙ్కటదాసున్
నానావిధ శుశ్రూషల
చే నతి సంప్రీతచిత్తుఁ జేసి భజింపన్.

క. సుస్వరయుతు నా ధ్రువలయు
నాస్వాదిత రసపరంపరార్థునిఁగని స
ప్తస్వర మంత్ర మహాత్మ్య
ర్వస్వము గురువర్యుఁ డతని వశముగఁ జేసెన్.

చ. చదివినవాఁడు శాస్త్రముల
సార మెఱింగినవాఁడు బాల్యమం
దొదవెను రామభక్తి యిటు
లుండఁగ నిప్పుడు గాన విద్యయం
దదిర నిరంకుశప్రతిభుఁ
డై పొగడొందెను! పూర్వపుణ్యసం
పద యిది యిట్టివాఁడు భగ
వానుఁడుగాని మనుష్యమాత్రుఁడా?

వ. ఇటులు సంగీతశాస్త్రపారంగతుఁడై యావిప్రుండు:

శా. "శ్రీమ ద్రామకథా సుధారసముచే
సిద్ధార్థులై సద్యశ
శ్శ్రీమేటిల్లు మహాకవీంద్రులకు జే
జేల్వెట్టి వేమారుఁ ద
న్నామంబుం జరితంబు శాస్త్రగత నా
నారాగతాళంబులన్
నేమంబొప్పఁగఁ గూర్చి పాడుకొనిమెం
తే ధన్యుఁ డౌదుంగదా!"

క. అనుచుం "గిరిరాజసుతా
తనయా సదయా" యటంచు ద్వైమాతురునిన్
మనమునఁ దలఁచుచు నా శ్రీ
వననిధి తొలిఁ బాడఁదొడగె బంగాళమునన్.

బంగాళము - ఆదితాళము

ప. గిరిరాజసుతా తనయ సదయ గి.
అ. సురనాథ ముఖార్చిత పాదయుగ
పరిపాలయ మా మిభరాజముఖ గి.
చ. గణనాథ పరాత్పర శంకర
ఆగమవారినిధిరజనీకర
ఫణిరాజకంకణ విఘ్ననివారణ
శాంభవ శ్రీ త్యాగరాజనుత గి.

వ. వెండియు,

శ్రీరంజని - రూపకతాళము

ప. సొగసుగా మృదంగతాళము జతగూర్చి నిను సొ.
అ. జొక్కఁజేయు ధీరుఁడెవ్వఁడో
నిగమశిరోర్థముఁగల్గిన నిజవాక్కులతో స్వరశుద్ధతతో సొ.
చ యతివిశ్రమ సద్భక్తిని
యతి ద్రాక్షారస నవరస
యుతకృతిచే భజియించే యుక్తి
త్యాగరాజుని తరమా శ్రీరామా సొ.

వ. అనిమనంబున నించుకసందేహించియు శ్రీరాముని యందే భారమునైచి తత్కథామృతమును దన గానామృతముతోఁ జేరుప మొదలిడి;

ముఖారి - ఆదితాళము

ప. సంగీతశాస్త్రజ్ఞానము సారూప్యసౌఖ్యదమే మనసా సం.
అ. శృంగారరసాద్యఖిలసారపూజిత రామకథానందాబ్ధియుత సం.
చ. ప్రేమభక్తి సుజనవాత్సల్యము
శ్రీమద్రమావర కటాక్షము
నేమనిష్ఠ యశోధనముకల్గునే
నేర్పుకల్గి త్యాగరాజు నేర్పిన సం.

వ. అనిమరియు,

గరుడధ్వని - ఆదితాళము

ప. ఆనందసాగరమీదని దేహము భూమిభారము రామబ్రహ్మ ఆ.
అ. శ్రీనాయకా అఖిలనైగమాశ్రితసంగీతజ్ఞానానంద ఆ.
చ. శ్రీవిశ్వనాథాది శ్రీకాంతవిధులు
పావనమూర్తు లుపాసించి చాలా
భావించి రాగలయాదులచే
భజియించే శ్రీత్యాగరాజనుత ఆ.

వ. అని యిటులు మానసబోధఁ జేసుకొని నిరంతరానందసాగరమగ్నుండై ప్రొద్దుఁబుచ్చుచుండె అంతఁ గొంత కాలంబునకు.

క. తనయుల కిరువుర కంతట
నను కులరూపగుణవైభవాఢ్యలఁ గన్యా
మణులను బెండిలి యొనరిం
చెను రామబ్రహ్మ మహాహా శ్రీహరికరుణన్.

క. శాంతా రామబ్రహ్మము
లంతటినుండియు మహాత్ము లంతర్ముఖులై
చింతాలేశము లెఱుఁగక
సంతోషము నొందియుండ్రు సంతత మొకటన్.

క. దుష్టుఁడు జప్యేశుఁడు తమ
కష్టసుఖంబులకుఁ గాక కలహప్రియుఁడై
నష్టములఁగలుఁ గఁజేయు య
థేష్టవ్యాపారపరత నెల్లెడ నొకఁడై.

ఉ. నిండిన యౌవనంబు నవ
నీతసమానవిశుద్ధచిత్తముం
బండినకోర్కెలుం గలిగి
భాగవతోత్తముఁడైన త్యాగరాట్
పండితుఁ డాలిఁగూడి బహు
భంగుల సౌఖ్యరసాబ్ధిఁ దేలుచున్.

నొండియుఁ బారలౌక్యపద
వీస్మృతిఁ దప్పకయుండె నెంతయున్.

వ. అట్టియవస్థలయందు

నాట - ఆదితాళము

ప. జగదానందకారకా, జయ
జానకీ ప్రాణనాయక జ.

అ. గగనాధిప సత్కులజ రాజరాజేశ్వర
సుగుణాకర సురసేవ్య భవ్యదాయక సదాసకల జ.

చ. అమరతారక నిచయకుముదహిత పరిపూర్ణా
అనఘసురసురభూజ దధిపయోధివాసహరణా
సుందరతరవదన సుధామయవచోబృంద
గోవింద సానంద మావరా అజరాప్త శుభకరా అనేక జ.

౨. ఇంద్రనీలమణి సన్నిభాపఘన
చంద్రసూర్యనయన అప్రమేయ
వాగింద్రజనక సకలేశ శుభ్ర
నాగేంద్రశయన శమనవైరిసన్నుత జ.

౩. కరధృతశరజాల అసుర మదాపహరణ
వనేచరావన కవీనబిలజ
మౌనికృతచరిత్ర సంతతశ్రీ
త్యాగరాజసన్నుత జ.

౪. సృష్టిస్థిత అంతకారికామిత
కామితఫలద అసమానగాత్ర

శచీపతినుత అబ్ధిమదహర
అనురాగరాగరాజిత కథాసారహిత జ.

౫. పాదవిజితమునిశాప శమపరిపాల
వరమంత్రగ్రహణలోల
పరమశాంతచిత్త జనకజాధిప
సరోజభవవరదా అఖిల జ.

౬. పురాణపురుష నృవరాత్మజ
ఆశ్రితపరాధీనకర విరాధరావణవిరావణ
అనఘపరాశర మనోహర
వికృతత్యాగరాజసన్నుత జ.

౭. సజ్జనమానసాబ్ధిసుధాకర
కుసుమవిమాన సురసారిపుకరాబ్జలాలితచరణ
అవగుణాసురగణమదహరణా
సనాతన అజనుత జ.

౮. ఓంకారపంజరకీర పురహరసరోజభవ కేశవాదిరూప
వాసవరిపుజనకాంతక కళాధరకలాధరాప్త
ఘృణాకర శరణాగతజనపాలన
సుమనోరమణ నిర్వికారనిగమసారతర జ.

౯. అగణితగుణ కనకచేల సాలవిదళన
అరుణాభసమానచరణా అపారమహిమాద్భుత
సుకవిజనహృత్సదన సురమునిగణవిహిత కలశనీరనిధిజారమణ
పాపగజనృసింహ వరత్యాగరాజాదినుత జ.

వ. అనుచు నిరంతరనామ సంకీర్తనఁ జేయుచుండు;
మఱియు,

ఉ. లేశము లెంచుచుం దెలియ
లేక మహాత్ముని చిత్తవృత్తిల
క్ష్మీశ సమర్పితంబనుచు
నెల్లెడఁ దమ్ముని మత్సరగ్రహా
వేశితుఁడై కలంచి పలు
పీడలఁ గల్గఁగఁ జేయుచుండు జ
ప్యేశునిఁగాంచి యిట్టులని
యెన్ జనకుం డొకనాఁడు మెల్లనన్.

ఉ. ఏర కుమార! యింతమతి
హీనుఁడవైతివి నీదుచర్య మ
మ్మారటఁ బెట్టుచున్నది క
దా! సతతం బిదియేల పద్మకా
సారములోనఁ బెన్మొసలి
చాడ్పున నాతతశుద్ధవైదికా
చారపవిత్రగోత్రకల
శంబున భేకము నట్టులైతివే.

ఉ. నమ్మితి నెమ్మనంబున గు
ణంబుల నీవనుఁ బెద్దవంచు నా
నమ్మిక వమ్ముచేసి కఠి
నమ్మగుమార్గముఁ బట్టితీవు క
ర్మమ్మిఁక మత్స్వరాకృతము
రా యది నిన్ననఁ గార్యమేమి మీ
యమ్మ మొగమ్మునైనఁ గన
రా యది నీ కొఱ కెంత యోఁడనో.

ఉ. పెద్దవుగాన యింటి కిఁక
వృద్ధులమైతిమి మేముఁ బెద్దయుం
బ్రొద్దిట నుండఁబోము మఱి
పుత్త్రులఁ గాంచఁగఁబోము తండ్రి! మీ
రిద్దరె దారిచూపుటకు
నీక్షణము ల్గద మాకునట్టిచో
గద్దరివాఁడె సోదరుఁడు
గాఁడొకొ చాయగ నీకు నాయనా!

ఉ. మాయెడ నెన్నఁడైన నణు
మాత్ర మవజ్ఞతఁ జూపఁబోఁడు ని

న్నాయతభక్తితోడ మము
నట్టులె చూచుచు నున్నవాఁడు మా
కాయమువంటివాఁడు చరి
తార్థుఁడు కష్టసుఖంబులందు నీ
కాయతిఁ దోఁడునీడయయి
యాయతికాఁడయి నిన్నుఁ బెంచఁడో.

క. కమలేందీవరముల సా
మ్యమునొందుచుఁ జిత్తమెప్ప డలరఁగవలయున్
సుమహిత సద్గుణ సాంద్రుల
విమలప్రతిభాసమృద్ధి వేమరుఁ గనుచున్.

క. అన విని యా జ్యేశుఁడు
మనమున మరియింత కోపమాత్సర్యంబుల్
బెనఁగొన నిందించెను ద
మ్ముని జననీజనకుల నతి మోటుఁదనమునన్.

క. ఈసున సద్గుణయుతునకు
దోసంబులఁ దలకుఁజుట్టి దాసఁగులు వాసఁగం
జేసెడి జ్యేశునితో
వేసటఁబడుఁ ద్యాగరాజు వేయి విధములన్.

జయంతసేన - ఆదితాళము

ప. సత్తలేనిదినములు వచ్చెనా స.
అ. సత్తమాత్రమా సచ్చిత్తశాయీ సాకేతనిలయ దైవ స.
చ. కలిలోనఁ బ్రబలమపాదములోఁ దలిదండ్రి గురుభక్తిలేక
పలుమారు దుష్కృత్యముల సేర్వవలెనా! త్యాగరాజనుత స.

క. తనతొంటిపుణ్యఫలమో
యనఁగా నాభాగవతుని నర్ధాంగి మహా
ద్గుణమణియై యిట్టిమెర్ఱ
ఘనతరసుఖపారవశ్యఁగా నొనరించున్.

మ. తులసీదూర్వసుగంధ పుష్ప జలముల్
ధూపాక్షతల్ దీపవ
ర్తులు నైవేద్యఫలప్రకారములు నెం
తో భక్తితోఁ బళ్లెరం
బులలో సిద్ధముగా నమర్చి వికచాం
భోజాక్షి నిత్యంబుఁ బ్రాం
జలియై నాధుని సన్నలన్ మెలఁగుఁ దూ
చాదప్ప దెవ్వేళలన్.

శా. సీతారాములఁ దల్లి దండ్రులనుచుం
జింతించు నాభర్తకున్

సీతారాముల నత్తమామలనుచున్
సేవించు నీభార్యకున్
సీతారామకటాక్షవీక్షణములం
జేకూరె నన్యోన్యమున్
సీతారామమయస్వరూపగుణ స
చ్ఛ్రీయంబు లెవ్వేళలన్.

ఉ. అక్కజురాలు నాథునకు
ప్రాణముతోసమ మార్యదంపతీ
ఫక్కికి జీవగఱ్ఱ కుల
భామలకుం దలమానికంబు నా
చక్కఁదనాలచుక్క గుణ
సంపద కిక్కను బాసి యావిభుం
డొక్కనిమేసమైన మరి
యుండఁడు ఛాయను సూర్యుఁ డట్టులన్.

శా. తాతా! నీచతురాస్యనామమది సా
ర్థంబే చుమీ చూడ నీ
చేఁతల్ చిత్రము లద్దిరయ్యా! తతసు
శ్రీకంబు లబ్జాక్షులన్

భూతక్షేమము పొంటెఁగాదె ప్రియతా
పూర్ణాత్ములంజేసి ప్ర
ఖ్యాతిం గాంచితి వైన నెల్ల యెడలం
గాదేలకో యట్టులన్.

శా. గోపాలుండు కృపాలవాలుఁడగుచుం
గుబ్జా పరిత్రాతగా
నోపం జక్కఁదనంబుకారణము కా
దుత్కృష్టమా ప్రేమయే
ఏపద్మాసన మెట్టివేళ మరితా
నెవ్వానియం దాసతోఁ
జూపుల్ నిల్పునొ కాని వానికొఱకై
చోద్యంబు ప్రాణంబిడున్.

శా. క్షుణ్ణుం డాయన శ్రీహరీ! శివశివా!
శూన్యోదరుం డెందులన్
విన్నాణంబుగలాఁడొ? యంబరసుమా
విర్భాతి! సద్రూపిమో?
కన్నారం గన రాత్రి వేళఁగలలోఁ
గాన్పించు! నెట్లైనఁబో

యన్నుల్ మిన్నఁగఁజూతు రొక్కొకట మో
హభ్రాంతులైయట్టి నిన్.

ఉ. ఆతఁడు హవ్యవాహనుని
సాక్షిగఁ బెండ్లిమగండె యైనచో
'నాతిచరామి'వాక్యముల
యర్థము తన్మిథునంబునందుఁ దా
నాతతపూత జీవితక
థామృత కారణభూమియున్ మహా
నీతికి సీమయున్ నిరత
నిస్తుల పుణ్యపురాణగాథయౌ.

గీ. వృద్ధులౌ శాస్త్రదంపతుల్ విసిగి విసిగి
దేహయాత్రలఁ జేయుచుఁ దివిరి తివిరి
పరమపురుషుని కీర్తనల్ పాడిపాడి
వెనుకముందుగ మేనులు విడిచిరంత.

చ. అనవర తావినీతుఁడగు
నగ్రజుఁ డంతటినుండి పెద్దయై
ధనముఁ గడించితెమ్మనుచుఁ
దమ్ముని బాధలఁ బెట్టుచుండ నా

యనఘుఁ డనూనకష్టముల
నన్నిటినిన్ భరియించి యిట్టులన్
మనమునఁ జింతనొంది పలు
మారులు వేఁడియుఁ బాడ నొక్కచోఁ.

## గౌళ - ఆదితాళము

ప. దుడుకుగల నన్నే దొరకొడుకు బ్రోచురా! దు.
అ. కడుదుర్విషయాసక్తుఁడనై తే గడియగడియకు నిటువంటి దు.
చ. సకలభూతములయందు నీవై యుండగా మతిలేకపోయిన దు.
౧. చిరతప్రాయములనాడె భజనామృతరసవిహీనకుతర్కుఁడైన దు.
౨. పరధనములకొఱకునొరులమదికరఁగఁబలికికడుపునింపఁదిరిగినట్టిదు.
౩. తనమదినిభువినిసౌఖ్యపు జీవనమేయనుచుసదాదినములుగడిపే దు.
౪. తెలియనినటవిటశూద్రులువనితలు స్వవశమగుటకుపదేశించి
సంతసిల్లిస్వరలయంబు లెఱుంగకయె. శిలాత్ముడయిసుభక్తునకు
[సమానమను దు.
౫. దృష్టికి సారంబగులలనాసదనార్భక సేనామితధనాదులను
దేవదేవ నెరనమ్మితియగాకను పదాబ్జభజనంబుమరచిన దు.
౬. చక్కనిముఖ కమలంబునను సదానెమ్మదిలో స్మరణలేకనే
దుర్మదాంధజనులఁగోరి పరితాపములచేఁ దగిలినొగిలిదుర్విషయ
దురాశలనురోయలేక సతత మపరాధినై చపలచిత్తుఁడైన దు.
౭. మానవతను దుర్లభమనుచు నెంచి పరమానందమంద లేకమదమత్సర
కామలోభ మోహులకు దాసుఁడై మోసపోవుఁగాక! మొదటి

కులజుడగుచు భువిని శూద్రులపనులు సల్పుచును నుంటినిగాక!
నరాధములనురోయ! సారహీనమైనను పాసించి తారుమారు దు.

చ. సతులకై కొన్నాళ్లు ఆస్తికై సుతులకై కొన్నాళ్లు
ధనతతులకై తిరుగుటేకాక త్యాగరాజాప్త యిటువంటి దు.

వ. అని యిటులం జింతించుచుండె వెండియు.

ఉ. ఆర్జవశీలుఁడై జనకు
నట్టులె స్వోదరపోషణార్థమై
యార్జనఁజేసి దుష్టవిష
యాప్తికి లోఁగక తృప్తుఁడౌచుఁ బి
త్రార్జిత రామపీఠము దు
రాగతలోకచపేటమున్ సదా
నిర్జిత స్వాంకవాటమును
నిశ్చలభక్తిని బూజసేయుచున్.

భైరవి — ఆదితాళము

ప. కొలువైయున్నాడే! కోదండపాణి కొ.
అ. తొలికర్మమణఁగఁ జూతమురారే,
తోయజారి రోహిణిఁ గూడినరీతి కొ.
చ. మనసురంజిల్ల సురసతులు అణిమాదులుకొలువ, [కొ.
వేవన్నెకనకశలాకనుగేరుసీతా కాంతతో త్యాగరాజనుతుడు

వ. అని నిరంతరముఁ బాడుచు వెండియు,

గౌరీమనోహరి - ఖండగతిలఘువు

ప. గురు లేక యెటువంటిగుణికి దెలియఁగఁబోదు గు.
అ. కరుకైనహృద్రోగ గహనమునుఁ గొట్ట సద్ గు.
చ. తనువుసుతధనదార దాయాదిబంధువులు
జనియించి చెదరజాలనికరుణతో
మనసునాటఁగఁజేయు మందునకుఁ దత్త్వబో
ధనచేసి కాపాడు త్యాగరాజాప్తునెడ గు.

వ. అని

క. గురుతరవిజ్ఞానంబటు
గురిపించుచునున్నయట్టి, కోవిదుఁ డయ్యుం
బరమార్థభరితచరితుఁడు
గురువరునొక్కరునిఁ గోరుకొనుచుండె మదిన్.

ఉ. ఘోరభవాబ్ధిమగ్నుఁడయి
క్రుంగుచునుండినపుట్టచూలికిన్
నారదమౌనిచంద్రుఁడను
నౌక లభించినయట్లు త్యాగరా
డ్ధీరుని చెంత కంత నరు
దెంచె సముజ్జ్వలభాసి సత్తపో
భారవిలాసియైన యతి
వల్లభుఁ డొక్కరుఁ డాతతాప్తుఁడై.

గీ. అనఘుఁడాతఁడు నారదమునియ యందు
రతనిశిష్యులు నూరిలో నార్యవరులు
అయినఁ గావచ్చు స్వేచ్ఛావిహారులైన
తాపసుల కెందు నేయసాధ్యంబు లేదు.

గీ. మట్టమధ్యాహ్నమున వచ్చినట్టి యతఁడు
నారదుఁడో యతివరుఁడో సన్న్యాసియొ మఱి
యెవరొ! ఎవరైన నేమి వాస్తవముచూడ
వినమె "యభ్యాగత స్స్వయం విష్ణు"వనఁగ.

ఉ. హెచ్చినభక్తి నాతఁ డెదు
రేగి మహాత్మునిఁ దోడితెచ్చి యే
పొచ్చెము లేక సర్వవిధ
పూజ లొనర్చి ముదశ్రుపూరముల్
పిచ్చిలఁ బాదసేవ నిడ
వేఁడుచు మ్రుచ్చిలె వాని చిత్తమున్
మచ్చిక మచ్చుపట్టె యజ
మానులచేష్టలు సాధుకోటికిన్.

ఉ. కావులు బూదిలావులును
గడ్డముఁ బెంజడ లక్షమాలికల్

చేవల నీనఁగా వగల
సింగముసంగము మోము బుద్ధికిం
దావలమై గతాగత వి
ధాతకు జీతము లెక్కవెట్ట నా
దేవుఁడు దివ్యభావుఁడవ
ధీరిత వార్షికమేఘురావుఁడై.

చ. అనునిటు నీదుమాట కన
ఘా ముదమందితి నంతెచాలు నీ
మనసు నెఱింగినాఁడఁ బర
మంబడి బుద్ధులప్రోడనేఁడు నా
కనువుగఁ జూపినాఁడు పర
మాత్ముఁడు వాని కటాక్షవైభవం
బున నె కదా సుభాస్వరమ
పూర్వముగా నుదయించు నెమ్మదిన్.

శా. కర్ణాకర్ణికగా భవత్సుగుణ సా
కల్యంబు విన్నాఁడనో
పూర్ణప్రాభవ శ్రీరఘూత్తమ కథా
పూర్ణంబు కానీకృతుల్

ఘూర్ణించున్ భవదీయగానకవితా
కుంభోపలబ్ధిన్ సదా
కర్ణింతుం జెవులార నీదుదయ గ
ల్గక్ నేఁడు భక్తోత్తమా!

మోహన - ఖండగతి

ప. నినుఁజూచికనులార నేధన్యుఁడనయితిరా ని.
అ. అనఘాకాకర్లవం శాంబోధి హిమకిరణ ని.
చ. గుణలుబ్ధుఁడవైయిటు గొనుము యశోధనము
గణుతింతురునినుఁగల కాలనుభక్తజనంబులు ని.

మ. అనుచుం దన్నుఁ బ్రశంసచేయఁగను స
న్న్యాసి న్వ్వలోకించి నె
మ్మన మందించుక సంతసించుకొని ధీ
మాన్యుండు దానప్పు డి
ట్లను నోస్వామి భవత్కటాక్షవిభవం
బత్యంతమై యుంట దా
సునిపై నిట్లనువారుగాదె బుధపూ
జ్యుల్ తారు నేనెంతవాఁ
డను మీపాదరజంబుఁ బోలుదునె క
ట్టా! వట్టి నిర్భాగ్యుఁడన్.

కనడ — రూపకతాళము

ప. శ్రీనారద నాదసరసీరుహభృంగ శుభాంగ శ్రీ.
అ. దీనమానరక్షక జగదీశ భేశసంకాశ శ్రీ.
చ. వేదజనితవరవీణా వాదనతత్త్వజ్ఞపరా
ఖేదహర త్రితాపరహిత ఖేచరవినుతా
యాదవకులజాప్త సదామోదహృదయ మునివరా
శ్రీద త్యాగరాజవినుత శ్రీకర మాంపాలయ. శ్రీ

క. అని యావచ్చిన సన్న్యా
సిని నారదుఁగాఁ దలంచి జేజేలనిడి కీ
ర్తనఁబాడి యనంతరమునఁ
దనపాండితి వెలికిఁబుచ్చెఁ ద్యాగ విభుండున్.

క. భిక్షుస్వరూపుఁ డనఁదగు
భిక్షువు తలయూఁచి వంచి ప్రీతి నిటులనున్
దక్షుఁడ వైతివి భక్తా
ధ్యక్షుఁడ సంగీతవిద్యయందు నయారే!

చ. ఒరులను జూచి వారు తల
లూఁచుచునుందురో లేదో యంచు నా
తురత జనింపఁ జిత్తమున
దూరపుఁగేకల వేయసాఁగి తం

బురశ్రుతిమించి నాదసుఖ
ముందలఁబెట్టని బిందుభావనే
తరుఁడు కళారహస్య నిజ
తత్త్వము లెట్టు లెఱుంగనేర్చునో.

చ. అని చిరునవ్వొలర్చి నగు
ణాఢ్యుని వాగమృతంబు విన్నయం
తనె యొడలెల్ల జల్లుమన
ధన్యచరిత్రుఁడు త్యాగరాయఁడా
తని పదపంకజాతములఁ
దద్దయుబ్రాలెను భక్తితోడ వా
గ్ధ్వనుల నెఱుంగు టొక్కయరు
దా స్వవశీకృతనాదమూర్తికిన్.

శ్రీరాగము — ఆదితాళము

ప. ఎందరో మహానుభావులు అందరికివందనములు ఎం.
అ. చందురువర్ణునియందా చందమామ హృదయారవింద
మందునజూచి బ్రహ్మానంద మనుభవించువార లెం.
చ. సామగానలోల, మనసిజలావణ్య ధన్యమూర్ధన్యు లెం.
౨. సరగునఁబాదములకు స్వాంతమను
సరోజమును సమర్పణముచేయువా రెం.

3. మానసవనచరవరసంచారమునిలిపిమూర్తి బాగుగబొడగవారలెం.
4. పతితపావనుఁడనే పరాత్పరునిగుఱించి
పరమార్థమగు నిజమార్గముతోన
పాడుచును సల్లాపముతో స్వర
లయానురాగములఁ దెలియువార లెం.
5. హరిగుణమణిమయసరములుగళమున
శోభిల్లు భక్తకోటులిలలో
తెలివితో చెలిమితో కరుణగల్గి
జగమెల్లను సుధాదృష్టిచే బ్రోచువార లెం.
6. హొయలుమీరనడలుగల్గు
సరసుని సదా కనులఁ జూచుచును
పులకశరీరులై యానందపయోధిని మగ్నులయి
ముదంబునను యశముఁగనువార లెం.
7. పరమ భాగవతమౌనివర శశివిభాకర సనకసనందనది గీశసుర
కింపురుష కనకకశిపుసుత నారదతుంబురు పవనసూను బాల
చంద్రధర శుకసరోజభవ భూసురవరులు పరమపావనులు
ఘనులు శాశ్వతులు కమలభవ సుఖసదానుభవులుఁగాక యెం.
8. నీమేనునామవైభవంబులను నీపరాక్రమ ధైర్యములశాంతమాన
సము నీవులను వచనసత్యమున రఘువర నీయెడసద్భక్తియె
జనింపగను దుర్మతములను దొలగఁజేసినట్టి నిన్ మదినెఱింగి
సంతసంబునను గుణభజనానంద కీర్తనము సేయువార లెం.
9. భాగవతరామాయణగీతాది శ్రుతిశాస్త్రపురాణపుమర్మములన్
శివాది షణ్మతములగూఢములన్ ముప్పదిముక్కోటి సురాం
తరంగముల భావమ్మునెరిఁగి హావరాగలయాది సౌఖ్యముచేఁ
జరాయువుల్గలిగినిరవధిసుఖాత్ములై త్యాగరాజాప్తులైనవార
[లెం.

కవి. అని తనయాత్మమునందుదయించున
హామ్మతిఁ దక్కి విచారముతోఁ

దనసముఖంబున దాసునియట్టు లు
దారచరిత్రుఁడు నిల్వఁబడం
గనుఁగొని యాతనిఁ గాఁగిటఁ జేర్చి వి
కాసితుఁడై మృదువాక్యసుధా
కణములు గ్రాలఁగ గ్రమ్మరఁ దాపస
కైరవమిత్రుఁడు వల్కె నిటుల్.

ఆనందభైరవి - ఆదితాళము

ప. ఓ సుజననుత గుణోన్నత యో.
అ. భూసురాగ్ర గణ్యుఁడవనఁబరగుదు వో.
చ. నీసమానుఁగాన నెచటనిపుడ
భ్యాసముజేయు మిదో స్వరార్ణవము
శ్రీసఖుండు నారదాదిమునులకుఁ
జెప్పినట్టి యది ఋషిపరంపరగ
నీసర్వంసహా నిన్నుఁ బోలు హరి
దాసులకబ్బినది దీనిఁగైకొను మో.

వ. అని

చ. దివిజమునీంద్ర సన్నిభుఁడు
ధీరునకట్టు లొసంగియాస్వరా
ర్ణవ మతిప్రీతితో భవవి
రాముఁడు తారకనామమంత్రముం

జెవి నిడి ధన్యజీవనునిఁ
జేసి యథేచ్ఛగఁ బోయె సద్గుణా
ర్ణవులకు సుస్వరార్ణవము
నం గలలాభముఁ జెప్పశక్యమే.

చ. కలుషము లార్చు నూతనవి
కాసముఁ గూర్చు యశంబుఁ బేర్చు వా
క్కులనఁ దనర్చు మేటి యుప
కార మొనర్చు నమర్చుభక్తి ము
క్తులఁ బశుబాల సర్పముల
కుఁ రసపుష్టిని గల్గఁజేయు శ
క్తులఁ దనరారు గానమున
కుఁ మరియొక్కటిసాటి గానమే.

శా. సంగీతస్వరధాటితో విగతావాం
ఛాకోటితో రామునిన్
సింగారించి యహర్నిశాదులు మదిం
జింతించి తన్నామముఁ
గంగావాహినిఁ జేరు నారధి మృగాం
కంబౌ యశోహంసికిన్

సంగాతుండగుచున్న వాని ననుజుఁ
జప్యేశుఁ డత్యుగ్రుఁడై.

వ. ఒకనాఁడు,

శా. ఏరా తమ్ముఁడ నిన్నుఁజూడ మది కెం
తేఁ గోపముం గల్గు వ్యా
పారం బేదియు లే దహర్నిశలు గూ
బల్ బ్రద్దలౌనట్టు లీ
యారావంబులఁ బెట్టుచుంటి వికఁ ని
ద్రాహారముల్ దోఁచనీ
వీరీతిం బచరించుచున్న మరి నీ
యిష్టంబు నేనొల్లరా!

శా. పో వెచ్చోటికి ముష్టియెత్త వెపుడుఁ
బూజావిధానంబులే
యీవేసాలకు మోసపోవుదునె నా
కీపాటియుం దోఁచదే
దేవుం గీవు నటుంచు చూడు మరి నా
దెబ్బెట్టిదో యిప్పుడే
కావేరిం బడవైతు నొక్కపరి నీ
కాకుత్స్థుఁ గీకుత్స్థునిన్.

వ. అని పోరుపెట్టిన యగ్రజునిం జూచి యావర భక్తుండు వినయంబుదోఁప—

ఉ. అన్న మరెందునైన భవ
దాజ్ఞల నేఁ దలఁ దాల్తుఁగాని సం
పన్నుల నాశ్రయింపుమను
మాటకుమాత్రమె చెప్పఁచుంటి నా
విన్నప మాలకింపు రఘు
వీరుని నామముఁ బాడుకొంచు నా
యన్నముఁ బెచ్చుకోఁ గలను
బ్రాప్తము నెవ్వరు నడ్డలేరుగా.

ఉ. చీమకు దోమ కన్న మిడి
చేకొని ప్రోచు జగద్విభుండు ద
న్నామజపంబుఁ జేసికొను
నాకొకపట్టెఁడుకూఁడు వెట్టఁడే
యేమిటి కింతదైన్యమిఁక
హీనులపాదము లాశ్రయించి యి
స్సీ మన సెల్లఁ జంపికొని
'చిత్తముచిత్త'మటంచుఁ బల్కుటల్.

మ. విను రాజానుమతంబు ధర్మమిఁక నీ
వేదాలు గీదాలు నీ
కును నాకే సరిపోవుఁగాక ప్రభువుల్
గూరాకు నే నిత్తురే
ఋణమైనం జెవినిచ్చువా రెవరు నీ
శాస్త్రాలు గీస్త్రాలకున్
మనధర్మంబును బాడుసేసికొను టీ
మాత్రానికై యేలకో!

చ. ప్రభువులటుండ నింక ధన
వంతులఁ జూడఁగ వారలైన నీ
యుభయ సుఖప్రదంబులగు
నుత్తమవిద్యల నాదరించి దే
శభజన సేతురేమొ యన
సాంబశివా! యది బూతుమాట యిం
క భవదశేషవిద్యలకు
గౌరవమెట్టులఁ గల్గునగ్రజా!

చ. పలికితి నిట్టులేనని ప్ర
పంచముసర్వము గొడ్డుబోదు సూ

కలరిక నక్కడక్కడ సు
కర్మరతుల్ మనవంటిపేదలే
కలిగినవారు కారయినఁ
గాని సుశీలులఁ గన్నయంత నే
పులకితగాత్రులౌచుఁ దమ
ముందటి యన్నమునైనఁ బెట్టఁగాఁ
గల రటువంటివారె మన
కాలముఁ దీర్పఁగ నర్హు లగ్రజా!

చ. తరుఁగని కీర్తిగన్న మన
తండ్రికిఁ దాతకుఁగూడఁ జూడు తం
బురమె కదయ్య యాస్తి యెటు
పోషణచేసిరో యీకుటుంబ మె
వ్వరి కెరుకే? త్రిశుద్ధిఁ దమ
పట్టిన శ్రీహరిపాదమేకదా
పరమదయాస్పదంబయి శు
భంబులఁ గూరిచె వారి కెల్లెడన్.

క. నాకు నదేగతి కూటికిఁ
గోకకునై వేఁడఁబోయి కుత్సితమతులం

జీకాకులపాలై పర
లోకమునకుఁ జెడను వినుము లుబ్ధుఁడ నగుచున్.

శా. నావిజ్ఞాపన మింతయే తెలియు మ
న్నా వేసమో మోసమో
నీవెట్లాడిన నాడవచ్చునుగదా
నీయిచ్చ నారామునిం
గావేరిం బడవైతొ లేక మరి యే
కష్టాలపా లైసెదో
ఈవాద ప్రతివాదము ల్సలుపఁబో
నేనాఁడు నీతో నిఁకన్.

వ. అని తనమనోభిప్రాయంబు నాతని కెఱింగించి యా మహాత్ముఁడు ఆత్మదైవము నుద్దేశించి,

శంకరాభరణం - ఆదితాళం

ప. ఎందుకు పెద్దలవలెబుద్ధియ్యవు,ఎందుబోదునయ్యారామయ్య ఎం
అ. అందరివలె దాటి దాటితిరిగెద
వందరానిపండునై తివికదరా ఎం.
చ. వేదశాస్త్రతత్త్వార్థములఁగలిపి భేదరహితవేదాన్తములఁ దెలిపి
నాదవిద్యామర్మమును దెలిపి సాధత్యాగరాజార్చిత నిజముగ ఎం

నాటరాగము - ఆదితాళము

ప. నిన్నే భజన సేయువాడను నిన్నే.
అ. పన్నగశాయీ నే పరుల వేడలేను నిన్నే.
చ. స్నానాదిజపతప యోగధ్యానసమాధిసుఖప్రదసీతానాథ
సకలలోకపాలకా త్యాగరాజనుతా నిన్నే.

వ. అని మొఱ్ఱవెట్టుకొని మెట్టకేలకు నిద్రించెనంత నర్ధరాత్రంబున:

క. అనుజన్ముఁ డట్లు తెలిపిన
యనుపమసూక్తుల కలరక యత్యుగ్రుండై
గొనకొని రాముని పీఠం
బును శివశివ! పారవైచె పుణ్యాజనుఁ డయో!

సీ. సంతర్పితచకోర సంతానమైనట్టి
కౌముది మెచ్చునే కాకిపెంటి
నందిత షట్పాదసందోహమౌ పారి
జాతము మెచ్చునే కోతిగండ
సేవితాఖిల బుధశ్రేణీవిలాసమౌ
సురభిని మెచ్చునే సూకరంబు
సంతుష్ట నిఖిల సజ్జనలోకమైనట్టి
రాగము మెచ్చునే రాసభంబు



తే

గీ. మూలఁజేరును గాలితో నేలరాయు
నోదిగి దూరముగాఁ జను నోండ్ర వెట్టు
నట్టులే మూర్ఖచిత్తుల కిట్టిపనుల
నిద్దురయు నీరస మసూయ దద్దజేలుట.

ఉ. నత్తలపాటి సేయవు ఘ
నంబులు ముత్తైములెల్ల కొంగకుం
గత్తరి కందిగింజలును
గావురు రత్నములెల్ల కోడికిన్
నెత్తురు బంకకంటెఁ గడు
నీరస మత్తరుగంధ మీగకున్
సత్తును బత్తి సత్తలును
జట్టువ సేయని వబ్బకానికిన్.

వ. అంత;

ఉ. చేయక విష్ణుపూజ మరి
చేసెడువారలఁ జూచి బుద్ధిలో
రోయుచు వారితోడుత వి
రోధముఁబూని మహోగ్ర దుష్కృతుల్
జేయు కుకర్ములం దెలియఁ
జెప్పుచునున్నదొ నాఁగఁ గుక్కురో

కోయని కూసెనంతఁ దొలి
కోడి తపోజన బోధనార్థమై.

వ. అంత నాభక్తజనుండు మేల్కాంచి,

మాయామాళవగౌళ - రూపకతాళము

ప. తులసీదళ ములచేసంతోషముగాఁ బూజింతు తు.
అ. పలుమారుఁ జిరకాలము పరమాత్ముని పాదములను తు.
చ. సరసీరుహపున్నాగ చంపకపాటలకురువక
కరవీరమల్లికా సుగంధరాజ సుమములు
ధరణిని నొకపరియాయము ధర్మాత్ముని సాకేత
పురవాసుని శ్రీరాముని వరత్యాగరాజనుతుని తు.

వ. అని యనుకొనుచు లేచి,

ఉ. కాల్యములెల్లఁ దీర్చుకొని
క్రమ్మఱి యంత యథాప్రకారముం
గుల్యకుఁ బోయి భక్తిమెయిఁ
గ్రుంకిడివచ్చి పురస్థపీఠ ని
ర్మాల్యముఁ దీయనెంచుచుఁ గ
రంబును జూచినయంత నాత్మలో
శల్యము నాటినట్టులయి
చప్పున మూర్ఛవడెన్ గతాసుఁడై.

ఉ. ఆతత భక్తియోగ విభ
వామృత శీకరపూత హృత్సరో
జాతము ఘోరదుర్దివస
సంతమసావృతమైన యట్టి-చో
బోతనయట్టి మేటి కవి
పుంగవుఁడే తగుదానిఁ దెల్పఁగాఁ
గోతులవంటి మాదృశుల
కున్ నలుసంతయుఁ జేతనౌనొకో
కూత మెఱుంగుదారి నట
కుం డెటుదెల్పును సాధ్విచిత్తమున్.

క. నాలుగు మూలల వెదకియు
నాలో శ్రీలోలుఁగాన కాతత దుఃఖ
జ్వాలా పరివేష్టితుఁడై
కూలుం బలుమారుఁ గుప్పకూలిన పోల్కిన్.

హరికాంభోజి - ఆదితాళము

ప. నేనెందువెదుకుదురా హరి
అ. అనాల్గుమోములవానిమొర - లాలించిరాని నిను
చ. కలుషాత్ముఁడ దుష్కర్మయుతుఁడ పలుమారు దుర్భాషినై
ఇలలో భక్తాగ్రేసరులవేషినై త్యాగరాజనుత నిను

వ. అని వేదనం బడుచుండె నంత.

ఉ. లాలసుఁడై బిగించి శ్రుతు
లన్ "రఘువీరుఁడ యారగింపవే
పాల"ని తెల్లవారఁగనె
పాడఁడిదేమి విచిత్రమో యటం
చాలియు శిష్యపాళియును
నాలరి యన్నయు వచ్చి చెంగటన్
వ్రాలినఁ దత్క్షణంబె నిజ
భక్తుఁడు వారలఁ జూచి యిట్లనున్.

ఆరభి - ఆదితాళము

ప. సాధించెనే ఓమనసా సమయానికి దగుమాటలాడి సా.

అ. బోధించిన సన్మార్గవచనముల - బొంకుచేసి తాపట్టినపట్టు
సమయానికి తగుమాటలాడెనె సమ.

చ. దేవకీవసుదేవుల నేగించినటు సా.
రంగేశుని సద్గంగాజనకుని-సంగీత సాంప్రదాయకుని సా.

౨. వనితల సదా చొక్కఁజేయుచును
మ్రొక్కఁజేసే పరమాత్ముఁ డదియుఁగాక
యశోదతనయుఁ డంచు ముదంబునను
ముద్దుబెట్ట నవ్వుచుండుహరి సమ.

3. పరమభక్తవత్సలుఁడు సుగుణపారా
వారుండా జన్మమనఘుఁ డీకలిబాధల
దీర్చువాఁడనుచు నే హృదంబుజమునఁ జూచుచుండఁగ సమ.

४. హరేరామచంద్ర రఘుకులేశ మృదుసుభాష శేషశయన
పరనారీసోదరా అజవిరాజతురగరాజనుత
నిరామయా అపఘన్న సరసీరుహ దళాక్షయనుచు
వేడుకొన్న నన్ను తాఁ బ్రోవకయె సమ.

౫. శ్రీవేంకటేశ స్వప్రకాశ సర్వోన్నతసజ్జన
మానసనికేతన కనకాంబరధర లసన్మకుట
కుండలవిరాజిత హరేయనుచు నే పొగడఁగా
త్యాగరాజగేయుని మానవేంద్రుఁడయిన రామచంద్రుని సమ.

౬. సద్భక్తుల నడతలిట్లనెనే అమరికగా నాపూజగొనెనే
అలుగవద్దనెనే విముఖులతో చేరబోకుమనెనే
వెతకలిగితే తాళుకొమ్మనెనే దమశమాది
సుఖదాయకుఁడు శ్రీ త్యాగరాజనుతుఁడు చెంతరాకయే సా.

వ. అని వెండియు;

క. తడికోక విడక పుడమిం
బడిపడి దండములు వెట్టి భక్తుఁడు "రామా!
విడువకు" మని కన్నీళుల
జడివానం గురిసికురిసి చలికిలఁ బడుచున్.

ఖరహరప్రియ - ఆదితాళము

ప. పట్టివిడువరాదు నాచేయి ప.
అ. పుట్టిననాడే నిజభక్తిని మెడఁగట్టి గుట్టుచెదరక ప్రోచిన నను నాచై ప.
చ. నిత్యానిత్యములను బోధించి కృత్యాకృత్యములను జదివించి
ప్రత్యేకుఁడవీవనికనిపించి భృత్యుఁడైన త్యాగరాజునిచేయి ప.

వ. అని విషాదంబు నొందుచు.

గీ. చిత్తవైకల్యమును జెంది చివరకతఁడు
తీర్థయాత్రాపరుండయి తిరుగు నప్డు
ప్రీతితోడుతఁ దంజాపురీ విభుండు
కోరి తనమంత్రి నీతనిఁ దేరఁ బనిచె.

క. చెల్లని నాఁ డెల్లరకును
వెల్లువలై పారుచుండు వేదాంతవచో
వల్లరులు వాటికేమిటి
చెల్లిన యిటువంటియపుడె చెప్పఁగవలయున్.

చ. పిలిచినవాఁడు మేటి పృథి
వీపతి యుద్దిర సంతసించి యీఁ
దలఁచిన లక్షలిచ్చు నెర
దాత రసజ్ఞుఁడు నట్టివాని యా

పిలుపు నిరాకరించి తన
విశ్రుతనామము సార్థకంబుగాఁ
జెలఁగిన యిట్టివాఁడె కద
సిద్ధవివేకి విరాగి జోగియగున్.

క. కుమ్మరిపురు వడుసున బలెఁ
దమ్మిని నీరమ్ము కరణిఁ దద్దయు సంసా
రమ్మునఁ గ్రుమ్మరు భక్తున
కిమ్మనుజేశ్వరుని పొత్తు లేమిటి కరయన్.

వ. అంతట నాభక్తుండు;

కల్యాణి - చాపుతాళము

ప. నిధిచాలాసుఖమా? రామునిసన్నిధి చాలా
సుఖమా? నిజముగబల్కు మనసా

అ. దధినవనీత క్షీరములురుచియో
దాశరథిధ్యాన భజన సుధారసమురుచియో

చ. శమదమమను గంగాస్నానముసుఖమా
కర్దమదుర్విషయ కూపస్నానము సుఖమా
మమత బంధనయుత నరనుతిసుఖమా, సుమతీ
త్యాగరాజనుతుని కీర్తనసుఖమా నిజముగబల్కు మనసా

దేశికతోడి - ఆదితాళము

ప. రూకలు పదివేలున్న చేరెడు-నూకలుగతిగాని ఓమనసా రూ.
అ. కోకలు వెయ్యున్నగట్టు కొనుటఒకటిగాని ఓమనసా రూ.
చ. ఉ కేలినతాఁబండఁగ మూఁడుమూరలతావుగాని
నూరుభక్షణములబ్బిన యెంతోనోటి కంతగాని
యేరునిండిపారిన పాత్రకుఁదగురీతి నీరువచ్చుగాని
సారతరునిహరిని త్యాగరాజసన్నుతుని మరవకేమనసా రూ.

వ. అని పాడి యానరపతి పంపునిరాకరించె.

సీ. మెత్తని శయ్యపై మేనుజేర్చెడు నాతఁ
డుర్విమీఁదనె పడియుండు నితని
భూరిమయామూల్యభూషితుఁడౌ వాఁడు
తులసిమాలికలతోఁ దూఁగునితని
అమల దుకూలాంబరములు గట్టెడువాఁడు
నీర్కావిదోవతి నెగడు నితని
షడ్రసోపేత భోజనముఁ జేసెడువాఁడు
కందమూలములతోఁ గడపు నితనిఁ

గీ. బిలచినం జాలు ననుకొనుపిచ్చివాఁడె
రాజ్యమేటికి సర్వత్ర పూజ్యునకును
భోగమేటికి సరస వాగ్భోగిపతికి
రాజు దయయేల యీ త్యాగరాజునకును.

ఉ. అంతట నామహీశుఁడు ని
జాజ్ఞల మీఱిన త్యాగరాట్ కృపా
కాంతునిఁ గట్టితెండనుచుఁ
గ్రమ్మఱ మంత్రులఁ బంచినంత దు
ర్దాంతము దుర్భరంబు నతి
దారుణమౌ నొక కుక్షిశూల యిం
తంతనరాని బాధనిడి
యాతని నొంపఁగఁ జేసె నెంతయున్.

క. విజిత హృషీకులసంతత
భజనపరుల నెన్నఁడేని బాధలఁ బెట్టన్
ద్రిజగన్నాథుం డైనను
వృజినంబునఁ బడకయున్నె వేయివిధములన్.

వ. అంత.

చ. "శ్రమపడనేల వైద్యులకు
శక్యముగాదు స్వయంకృతాపరా
ధమున ఫలంబుగాన నిది
త్యాగనరేంద్ర కటాక్షవీక్షణ
క్రమమునఁగాని చక్కఁబడ
రాదితరంబు లెమ్ము వేగ మీ

సమయమునందె పో మ్మతని
సన్నిధి కిమ్ముగ రాజచంద్రమా."!

చ. అని యొక జోగిరాజు కల
యందె జోగించిన యంతలోన మే
ల్కొని నిజబంధువర్గముల
కుంగలముంగలఁ దెల్పి భక్తితో
జనపతి పాదచారియయి
చక్కటిఁ దప్పక త్యాగరాజ ద
ర్శన మొనరించి సర్వశుభ
సౌఖ్యములం గొని యేఁగె నత్తఱిన్.

వ. ఆబ్రాహ్మణుఁడు వెండియుం జని చని.

ఉ. రంగదనేక వైష్ణవ త
రంగవిరాజిత తోయజాల యా
రంగ, ముదాత్తముక్తి బహి
రంగము, సంగతరత్నసౌధ సా
రంగము, సప్తగోపుర వ...
రాంగము, నై తనరారునట్టి శ్రీ
రంగముఁ జేరి చిత్తము క
రంగఁగ రంగనిఁజూచి పొంగుచున్.

కాంభోజి - ఆదితాళము

ప. ఓరంగశాయీ - పిలచితే ఓయనుచు రారాదా ఓ.

అ. సారంగధరునిఁజూచి కైలాసాధిపుఁడు కావలేదా
భూలోక వైకుంఠమిదియని నీలోననీవె యుప్పొంగుచు ఓ.

చ. శ్రీలోలుండవై యుంటే మాచింత దీరు టెన్నఁడో
మేలోర్వలేని జనులలోనే మిగులనొగిలి దివ్యరూపమున
ముత్యాలసరులురమునఁగనవచ్చితి త్యాగరాజహృద్భూషణ ఓ.

వ. అని స్తుతియించి యచటువాసి.

క. గిరియై కలియుగమందున
గిరిధరుని నివాసమై వికీర్ణాభయమై
ధరఁబరగుచున్న యా తిరు
గిరికరిగెను వేంకటేశుఁ గీర్తింపనొగిన్.

వ. అచట నాతనికి దర్శనంబుగాకుండ నావైష్ణ
స్వాములు తెఱవైచిరంత.

క. పరమపవిత్రముగాన స
ధరకుఁ రామ శ్రేంద్రుఁడు దయచేసినయా
తిరునామమంత్రమతములు
తెరచాట్లంబడుటఁజూచి ధీరుఁడు వగచెన్.

వ. వెండియు,

గౌళిపంతు - ఆదితాళము

ప. తెరదీయగరాదా నాలోని
తిరుపతివేంకటరమణ మత్సరమను తె.
అ. పరమపురుష ధర్మార్థమోక్షముల
పారదోలుచున్నది నాలోని తె.
చ. మత్స్యము ఆకలిగొని గాలముచే మగ్నమైనరీతినున్నది
అచ్ఛమైన దీపసన్నిధిని మరుగడ్డపడి చెరిచినట్టున్నది తె.
౨. ఇరవొందగ భుజియించుసమయమున నీఁగ తసులు రీతినున్నది
హరిధ్యానముచేయువేళచిత్తముఅంత్యజువాడకుబోయినట్టున్నది
౩. వాగురమని తెలియక మృగగణములునచ్చితసులురీతినున్నది
వేగమె నీమతము ననుసరించినను త్యాగరాజనుత మదమత్సర
మను తె.

వ. అని,

క. వరభక్తుఁడు పాడుటయును
గరమరుదుగఁ దెరలు దెగి వికావికలయ్యెన్
హరినిజదర్శనమిడె సు
స్థిరచిత్తుల కెందుఁగల[illegible]తెరలుం గిరలున్.

కవిరాజవిరాజితము

తిరుపతి వేంకటనాయకునిం గని
ధీరుఁడు భక్తివిశారదుఁడై

పరమశివస్థలము గ్గని కోపుర
వాసుని సుందరశర్వుని సుం
దరముదలయ్యరు నామకభక్తునిఁ
దద్దయుఁ బ్రేముడిఁ జూచి యటం
జిరతరరామవియోగముఁగూరిచి
చింతిలిచింతిలి చిక్కినటుల్.

శుద్ధబంగాళా - ఆదితాళము

ప. తొలినే జేసిన పూజాఫలము తెలిసెనునాపాలిదైవమా తొ.

అ. పలువిధములనే తెలచికరగగా
పలుకకనీనటు నేనిటులుంటిమి తొ.

చ. సరివారిలలో జోకనే సెదరు
దరపోమకులకు మరుగునఁ జేరిచి
హరిదాసరహిత పురమునఁ జేరిచి
అరయకయుంటివి త్యాగరాజనుత తొ

వ. అని మరియు,

మ. పరితాపానలతప్తచిత్తుఁడగుచుం
బల్మారుదుఃఖాశ్రువుల్
దొరుగన్ శ్రీరఘురామనామగుణ సం
దోహంబులంబాడి త

త్పరతన్ వెండియుఁ దన్నుఁదామఱచుత
ద్భర్తృన్ వియోగార్తయౌ
తరుణిం జెప్పఁదరంబె స్వానుభవవే
ద్యంబుల్ కదా తత్కథల్.

మ. నలగుంగూరుకురామి సుంతయును ను
న్మాదంబుతో నెంతయున్
మెలఁగుం బానుపు నాల్గుమూలలను ను
న్మీలాస్యుఁడై గాలికిన్
మలఁగున్ భాసురబుటుషయు క్త సురవ
ర్త్మంజూచి యొక్కింతలోఁ
జెలఁగున్ రాముని యోగ సంజనిత
శోచిష్కేశ తప్తాంగుఁడై
కలఁగంబారి శరీరము న్విడువ వ్య
గ్రంబొందు నొక్కొక్కటన్.

వ. ఇటుల బటుతరరామవియోగ పరితాపతప్తుండయి
పొన్నున నిటునటుఁ బొరలాడుచుండు నాభక్తవరు
నకట్టి యవసరంబున;

మ. పరమామ్నాయ పదార్థ్యగామియును భా
స్వద్ధంస సామ్యుండు నా.

వరభక్తుం డ్రీ జగద్గురుండు తన స
వ్యస్థానము జేర్చి త
త్పరమంత్రార్థముఁ జెప్పఁగప్పిన తిరో
ధానంబు నాఁడోఁచె నా
ధరణీదేవకులావతంసునకు ని
ద్రావస్థ యవ్వేళలన్.

వ. అట్టియెడ హంసకులావతంసుం డశేషభవతమో
విధ్వంసుం డఖిలధరాధరాంసుం డగురఘుకుల
పుంగవుం డతనికి స్వప్నంబునఁదోఁచి;

చ. "వినుము విచారము ల్విడుము
వేగముగా నిజవాససీమకుం
జనుము క్రమక్రమంబుగను
సైకతభూతలమగ్నుఁడైన న
న్గొనుము ధరాసుపర్వజన
కోటులు నిన్న నిశంబుఁ బాడఁగా
మనుము యశశ్శరీరివయి
మద్భజనామృతపీథివై ధరన్".

వ. అని తెలిపి తిరోధానుండయ్యె. వెండియు
బ్రాహ్మణుండు,

కవి. కలగని దిగ్గన మేల్కాంచి చిత్తవి
కాసముఁ జెంది శరీరమునం
బులకలుఁబుట్ట ముదశ్రులుఁ దొట్ట "న
మో రఘునాథ పరాత్పర తే
జలజహితాన్వయ దుగ్ధపయోధిని
శాకర, దుర్జనభీకర శ్రీ
విలసిత వాయుసుతార్చితపాద ప
విత్ర చరిత్ర కృపాజలధే."

మాళవి - ఆదితాళము

ప. నెనరుంచినాను అన్నిటికి నీదాసుఁడని నేను నీదుపై నె.
అ. ఘనాఘుజీమూతాసుగ వనధిగాంభీర్య నీపాదములయెడ నె.
చ. కలిలో మాటలు నేర్చుకొని కాంతలను దనయులను బ్రోచుటకు
శిలాత్ములైడె పలుక నేరనుర శ్రీ త్యాగరాజాప్త నీయెడ నె.

చ. అని యెలుఁగెత్తి పాడుచు స
హస్ర సహస్ర నమస్క్రియాతతిం
దనియక వెండియుం గడఁగి
ధారుణిఁ జాగిలి మ్రొక్కి మ్రొక్కి చే
తనముఁదొరంగి భక్తిపర
తంబొనరారుచుఁ బొర్లి పొర్లి యా

5

యనఘుఁడు భారుభారుమని
యర్భకునట్టుల నేడ్వసాగినన్.

మ. యజమానుండు వికారమై నెగడు కు
య్యాలించి దిగ్భ్రాంతుఁడై
నిజపత్నీసుత బంధుసేవకజనుల్
నెక్కొంచురా నొక్కెడన్
విజితేహుల్ గతమోహులు భక్తిపదవీ
విశ్రాంతదేహుల్ సదా
భజమానోన్నతబాహులఁ జూచెను మహా
ప్రారంభు విశ్వంభరన్.

సీ. అతనుద్వీపత్త్వల్యసిత దేహకాంతులు
దిశలకు నొకవింత తెల్విఁగూర్పఁ
దొలగిన నీర్కావిదోవతి రంగులు
ప్రాభాతదీప్తి విభ్రమము దోఁపఁ
భ్రష్టమై యందందపడియున్న పటికపుఁ
బూసల స్ఫుటబుద్బుదములకుఁ బోల
చేనున్న చిరతల చిఱుగజ్జెగుత్తుల
రవము పక్షుల కలరవము సరణి

గీ. మొనయఁ బ్రాకృతమది దినముఖముగాఁగఁ
దనరి ప్రోద్యత్ప్రభాకరధర్మకలన
ఘనకువలయ పరాగ సంకలితుఁ డగుచు
వసుధ సాష్టాంగముగఁబడి వరలు నతని.

వ. చూచి తనమనంబున.

ఉ. "పుట్టెను భూసురాన్వయ వి
భూతికిఁగాఁ గలికాలమం దిటుల్
నెట్టికసీలయూ నితఁడు
నిక్కముగా నలపుట్ట చూలియే
నెట్టనబత్తి నెత్తరలు
నిండిన చిత్తము హత్తమిల్లగాఁ
బట్టెను శ్రీరఘూద్వహుని
పాదము లీతని కీడెవండొకో.

ఉ. పట్టితి నీమహామహుని
పాదసరోజముఁ బాపకోటిఁ బోఁ
బెట్టితిఁ బుణ్యలోక పద
విన్ సరసాభులు సూచి పొంగఁగా
మెట్టితి నర్థసిద్ధులును
మేకొనె నమ్మక చెల్లు! గంగకుం

ఉ. భైత్తుకమ్ముఁ మహావనము
　　పాల్గొనరించి ధరాతలిన్ ధనా
ధ్యక్షుఁడవై చరింతువు కృ
　　తార్థముఁజేయఁగ సాధులోకమ్ముఁ
దక్షసుతాసమక్ష ఖల
　　ధర్మవిపక్ష ధృతాంతరిక్ష యో
యక్షరరూప రాజదణి
　　మాది విభూతికలాప సుందరా.

శహాన - ఆదితాళము

ప. ఈవసున నీవంటిదైవము- నే నెందుఁగానరా.
అ. భావుకముకల్గినరిల్లు కోవూరిసుందరేశ గిరీశ
చ. ఆసచే నరనిముసము నీపురవాసమొనరఁజేయువారిమది
వేసటలెల్లను దొలఁగించి ధనరాసులు నాయువులు
భూసురభక్తినీఁ దేజమునొసఁగి భువనమందు గీర్తిగల్గఁ జేసే
దాసవరదత్యాగరాజ హృదయనివాసచిద్విలాస సుందరేశ

మ. కలిధర్మంబున వేదబాహ్యగతులుం
　　గామాంధులుఁ లోభ వి
హ్వాలులుఁ నాస్తికులౌటమర్త్యులు స్వయం
　　హర్తృత్వముం బూని మెం
దులనో డాగినజానకీహృదయనా
　　థు న్నేఁడు కన్నారఁగాఁ

గలలోఁ గంటిని నీకృపం బురుషనా
గాకో పురీ సుందరా!

శా. నీవే నేనని నేన నీవని మహా
స్నేహంబువాటించు స
ద్భావుం డెవ్వఁడు స్వప్రయోజన రతుల్
బంధుప్రజల్ సర్వధా
యీ వెవ్వండవు నేనెవండ విరుమో
యీ ఈశ్వరుండేకదా
నీవై నీవును నేను నొక్కటనుచున్
నీనోటఁ బల్కించెరా.

ఉ. రిక్కకుఁజుక్క వెట్టుచు మ
రీచుల దిక్కులఁ గ్రక్కఁగల్గియున్
లెక్కలకెక్కఁజూడ వవి
లిప్తమనస్కత భూతధాత్రిలో
నెక్కటియై చరింతు దిన
మెట్టులఁ దీరునటంచుఁ గాలమున్
లెక్కిడుచుండు నీమదికి
లేబర మీవిభవంబు లన్నియున్.

మ. అటవిన్ జ్యోత్స్నయజాగళ స్తనము జా
త్యంధతకుమా భాగ్యముల్

జటిరంభాపరిరంభ గుంఫనము శు
ష్కక్షేత్రవర్షంబు లె
ట్లటు సత్సాధురతేతరాత్మక సమూ
హైశ్వర్యముల్ వ్యర్థముల్
పటుపాపానలహేతి కాహుతులునై
బాధించు లోకంబులన్.

శా. వేదం జూచి కరంగి చిత్తమున సం
ప్రీతిప్రభావంబు లా
మోదస్ఫూర్తియు వెల్లి బారఁగను సం
బోధించుచున్ క్షేమసం
వాదంబు ల్పచరించి యాప్తితమనో
వాంఛార్థ మర్పించు సం
వేదుండైన మనుష్యధర్మునకె యా
విశ్వేశ్వరుం డాప్తుఁడౌ.

ఉ. దర్పము దొప్పఁదోఁగ విత
థప్రియతామతిఁదన్నుఁ బోలు దు
స్సర్పుల మెప్పుటొప్పులకు
సంతస మొంది యసాధులోక సం
తర్పణ లాచరించెడు వి
దగ్ధుని యర్థ మనర్థకంబు కం

దర్ప విరోధి భక్తికల
నాపరతంత్ర చరిత్ర సుందరా!

మత్త. అన్న నేటికి నిన్నువంటి మ
హానుభావుని జూచితిం
గన్నులున్న ఫలంబు మిక్కిలి
గల్గు నోముల నోచితిన్
మున్ను వేడియు రామచంద్రుని
మోముఁ జూడఁగ వాచితిన్
నన్నుఁ బంపుము పోయివచ్చెద
నాగభూషణసన్నిభా!

వ. అని యిట్టుల నతని సెలవొందె.

ఉ. చందనమందుఁ గప్పురముఁ
జక్కెర గాంగజలంబు లందు నే
చందమున న్మనోజ్ఞతర
సౌరభముల్ రుచులందనర్చి యా
నందముఁ గూర్చునట్లె సుమ
నస్కులు శుద్ధవచస్కులైన గో
వింద గిరీశభక్తులగు
వీరల నెయ్యముగూడ నొప్పెడిన్.

శా. అన్యోన్య ప్రియభావులై
నెగడి శర్వారాధనాసక్తులై
దైన్యంబు న్విడనాడఁ బుచ్చి పరిశు
ద్ధస్వాంతులై భారతీ
స్తన్యోజ్జీవనులైన యాసుకృతి వి
స్తారుల్ త్రిలోకాధ్యులౌ
మాన్యుల్వారిని సంస్మరించుకొనిన
న్మాయుంగదా పాపముల్.

ఇది ఆదిభాగము

---

శ్రీరస్తు

# త్యాగరాజస్వామి చరిత్రము

## మధ్య భాగము

---

మహాస్రగ్ధర: తతగుంజన్మత్త షట్పాదకులరచిత స
త్తానసంతాన సంపా
దిత సంఖ్యాతీత తాళోదిత విగతినట
ద్దివ్యహంసావళీ సే
వితరాజత్పద్మినీ హృత్ప్రియజన సుషమా
విభ్రమాభ్యన్తరంబై
సతతాంభః పూర్ణగర్భస్ఖలితమమల కా
సారసారంబు భాస్వ
త్ప్రతిబింబం బంతఁ గాంచెన్ వరసమయ కృపా
పార భాగ్యంబుగల్గన్.

వ. అంత మాధ్యాహ్నిక స్నాన సంధ్యాద్యనుష్ఠా
నము లాచరించి యాభగవానుండు పరమశివం
కరుండైన శంకరుని దర్శించి.

చిత్తరంజని - ఆదితాళము.

ప. నాదతనుమనిశం శంకరం-నమామి మే మనసా శిరసా నా.

అ. మోదకరం నిగమోత్తమసామ-వేదసారం వారం వారం నా.

చ. సద్యోజాతాది పంచవక్త్రజ సరిగమ పధనీతి వరసప్తస్వర
విద్యాలోలంవిదళితకాలం విమలహృదయ త్యాగరాజపాలంనా.

వ. అని పాడియింటికి వచ్చునంతలో.

శా. "కాకుత్స్థ ప్రవరప్రయుక్త విలస
ద్గాంధర్వశాస్త్రంబు సు
శ్లోకంబై దివిషద్వరేణ్యగణ సం
సేవ్యార్థమై యొప్పె సు
శ్లోకుం డీతఁడు భూమిఁ బుట్టుకతనం
జోద్యంబు కాదొక్కొ- స్వ
ర్లోకంబైనఁ దృణప్రమాణ మనుచున్
లుప్తేహుఁడై యుండుటల్.

శా. ఈ నాదేహము గేహమున్ విభవమూ
హింపంగ ధన్యంబులౌ
నీ నిశ్శ్రేయసభార్గవీ ప్రియతముం
డీయర్థ సర్వస్వముం.

దానే కైకొని పుణ్యలోకహిత బో
ధ లేసెయు చీరీతిగా
నానాధర్మ సుకర్మమర్మముల నా
నందాబ్ధి నం దేల్చినన్.

ఉ. ముట్టెడు చిల్లిగవ్వయును;
ముచ్చటదీరఁగఁ జూతమన్న నో
గట్టెడు పట్టుకోక; నొక
కాసున కేనియుఁ జూడఁ డక్కటా
పట్టెడు కూడు మూఁడు నర
బారల గుడ్డయునే మహాధికం
బట్టెడు నన్ను నాసిరుల
నెట్టుల ముట్టును వట్టి మాటయే."

క. సుందరుఁ డీవిధముసఁ దన
డెందంబునఁ దలఁచుకొని వడిన్ శిష్యులఁ దా
నందరినిఁ బిలిచి కడు నా
నందంబునఁ బలికె నిటుల నయగారములన్.

ఉ. "ఓ యకలంకభక్తి విభ
వోన్నత చిత్తసరోజులార, మీ
నాయకుఁడైన త్యాగజన
నాయకుఁడింటినిఁ జేరఁగానె యీ

వేయివరా లవేయొసఁగి
వేయుఁడు దాయుఁడు దీని నిప్పటన్
నాయెడ నింతపాటి కరు
ణంగొనుఁడీరలు మిమ్ము వేఁడెదన్.

ఉ. రాగము లేనివారు; బహు
రాగలయంబులఁ బూనినార; లా
భోగముఁజేసి సర్వసుఖ
భోగము లెంతయు మానినారు; శ్రీ
రాగము గాయకాళికిఁ ది
రంబుగ దైవత దూరమన్న బై
రాగికి శిష్యులీరు; కొన
రా మదిరాగిలి యీ హితార్థమున్.

ఉ. తప్పనరాదు దీనవిత
థం బిసుమంతయు నైన లేదు నా
గొప్పదనంబు గాదిఁక న
కుంఠితభక్తి రసాశ్రుపూర్తి కన్
ఱెప్పలఁ దొప్పఁదోఁగి యిటు
రేచినదిమ్మ్యెడఁ జూడుఁడయ్య యీ
యప్పన మెప్పుడైన సుజ
నాళికిఁ దప్పక మెప్పుఁ గూర్పెడున్.

ఉ. భాగవతార్థ వేదులగు
వారె మదర్థముం ద్రోసి రాజుఁగా
లోఁగొన నొల్లకుండు నెడ
లోకములోఁ జరితార్థమేది? నా
కేగతి? యెందుకీవిభవ
మెల్ల? మహామతులార! తెల్పుఁడీ
యూగమ లాభమంతయు ని
రర్థకమై చెడరాద దెన్నఁడున్.

వ. అని వారలఁ బ్రార్థించి యొప్పించి యొక సంచిని వారికడనుంచి చనియె నంతట భక్తుండును మరలి వచ్చి శిష్యులం గూడి.

ఉ. కూటుఁ గొళంబుఁ బల్దినుసు
కూరలుఁ బప్పులు నప్పళంబులున్
మేటిగఁ దైరుపచ్చడియు
మేలగు సాంబరు చారు లుక్కెరల్
తేటలు దేరు మోరుఁ గడుఁ
దీయనినీరును లంక గాఁగ సా
పాటొనరించి దైవమును
బాడుచుఁ దృప్తిగ లేచి యంతటన్.

ఉ. రాముని ఘోరపాతక వి
రాముని నాశ్రిత లోకనందనా
రాముని మైథిలీ హృదభి
రాముని గోపురసోమునిం గృపా
ధాముని సుందరున్ సుగుణ
సుందరు నెమ్మదిఁ బాడి శిష్య చిం
తామణి యంత దారసహి
తంబుగ మార్గముఁబట్టె నూరికిన్.

వ. శ్రీమద్రాఘవ చరణారవింద నిష్యంద మరంద
బిందు సందోహాస్వాదనానందితేందిందిరుం డగుచు
నాభక్తప్రవరుండు, పాపాత్ముల పగిది నిక్కి
మిక్కిలి వాడిగలిగిన ముండులచే నిండుకొని
యుండు పొదలు పొదలుకొనఁ గదలమెదల నట
నులేక సలుచక్కియలఁ జిక్కులువడి మిక్కుటి
పుంగిన్కచే ఫూత్కారంబు సేయుచుండు ఫణి
మణిమరీచి మాలికలు మరీచికా విభ్రమంబుల
బ్రోదిసేయుచుఁ బరోపకార జనవారపదసరో
రుహ నీరాజనంబులై పాదంబులకడ భాసిల్ల నత్యు
నుకూల దాంపత్య మహిమాతిశయావాప్తి
వేరవుం జూపుచు నశిథిల పరిరంభసూత్రము

కుదాహరణంబులై యున్న లతావితానముల య
నూన సౌకుమార్యంబులకు మ్రాన్పడి కదలలేక,
బ్రాహ్మణాయనుండునుం బకశ్వాత త్త్వపరిజ్ఞానవిన
మ్రుండును నగు తన్ను ము_క్తఫలార్థుంగాఁ జేసి
వంగివంగి సలాములఁ జేయుచుం బ్రాతి దలిర్ప
నంచిత ద్విజకులదంపతీసంజవన శోభనంబులై
మధ్యందినతరణి కిరణావారంబులం దమ పరాంగ
ములు తద్దయుం దపించు చుండినను దమపాదం
బుల నాశ్రయించియుండిన జంతుసంతానములకు
సంతానప్రాయములై సంతోషం బొనవఁ జేసి
తాపంబుం బాపి కాపాడుచుండిన మహీయసోపమ
మహీరుహంబుల కావాసంబైన మహారణ్యాంబు
నం బడి, విలసద్భ_క్తిలత నిరలంకృతమై యుంట
యు_క్తంబు కాదని స్వాలతాంతములం దాని నలం
కరింపం బూనుకొన్న కుసుమలతావితానంబుల
సౌహార్ద భావంబున కుబ్బుచు,మదాంధీభూతములై
బలదర్పవిహ్వాలంబులై మహీధర గుహాంతరాళం
బులం బ్రతిధ్వనులు వొడమ గర్జించి గర్జించి
మిన్నును మన్ను నేకం బగునట్లు ద్రుళ్లి త్రుళ్లి
మెట్టకే నురులం బడుచుండిన బొబ్బ మెకంబుల

 వాగ

పెనుబొబ్బలకుం దబ్బిబ్బువడి చెదిరి పారుచు
గజయూథంబుల కొత్తిగిలుచు, జంకదుష్ట శర
థులం బురుడించుచు నెదిరించిన యెనుబోతు
వెఱచి వెఱచి పఱచు మృగంబులం జఱచి యె
చిందిన బెబ్బులుల యెంగిలిఁ దిని కడుపు ని
కొనం జేరఁ బారు ఘోరవంబులయారవంబులు
కుహరంబులకు వెక్కసంబులై పర్వం జెక్కి
జేతులం జేర్చుకొని యల్లనల్లన "సీతావల్లభ
రథే" యనుకొనుచు నందంద విలసిల్లు కూజన్మ
పరభృతకుల విజిగీషుభూతభిల్లపురంధ్రీగీతం
స్వరమాధురీ మహిమంబుల కుల్లసిల్లి చిందరగ
యందముగం, జిందులం ద్రొక్కు భిల్లనర్తక
దంగతాళనిస్వనవహన క్లేశవశంబున మందగ
నుండై వచ్చు సమీరకుమారుని సదాగ
మెచ్చి స్వాగతం బిచ్చి గ్రుచ్చి కౌఁగిటం జే
లోఁగొనుచు.

చ. రమణ చెలంగగా 'ఖరహ
ర! ప్రియరూపక! రామ! నీసమా
న మెవరురా' యటంచు భజ
నం బొనరించెడి యాసుధీ సుహృ

త్తముఁ గని తామసింపక ప
తంగుఁడు నింగిఁ జెలంగి సామన
స్యముఁగొనె నేమి వింత యది
సాధుసమాగమ భాగ్యశాలికిన్.

ఖరహరప్రియ - రూపకతాళము

ప. రామ నీసమాన మెవరు-రఘువంశోద్ధారక రా.
అ. శ్రీభామామరువంపుమొలక-భక్త్యనుపంజరపుఁ జిలుక రా.
చ. పలుకుపలుకులకు తేనె-లొలుక మాటలాడు సోద
రులు గల హరి, త్యాగరాజ-కులవిభూష మృదుసుభాష రా.

ఉ. గీతము విస్తరించి తమ
గేస్తుల రెక్కలఁ గుస్తరించుచుం
బ్రాతి దలిర్పఁ జంచుపుట
భారతి భావముఁ బ్రస్తరించి మం
దాతపకాలమందు మల
యానిలపుష్పిత మల్లికాలతా
కేతనసీమలన్ మదన
కేళులఁగూడెను రామతమ్మలున్.

చ. అతులితశాంతుఁడై పరమ
హంసపదుండయి నీరుకావి దో

వతుల ధరించి జాయకటు
వంటివయిచ్చి వినమ్రులైౖ సుధా
మతుల పవిత్రకంకణ న
మస్కృతులొందెె నినుండు సాధు స
గతుల నిలన్ సదాశుచికిఁ
గ్గదె యెంతటిదైైన తేజమున్

ఉ. బోధహితు ల్సమ స్తగుణ
పూర్ణు లయూరె త్రితాపవర్జితుల్
సాధిత హంసు లద్భుతర
సప్రతిభా పరతంత్రజీవనుల్
సాధువు లట్టివారలకె
సంతతవైరముఁబూని రాక్షసుల్
బాధలఁ గల్గఁజేయుదురు
పంతముఁబట్టి యనేకరీతులన్.

ఉ. లోకముసాటిమాని పర
లోకరతిన్ మదిఁబూని మమ్ముఁ జీ
కాకులపాలఁ బెట్టుచు న
ఖండపుజ్యోతిని లోనఁ గట్టి బల్

తేకువనించి మున్ను నన
దేశమునందునె యుండఁజేసె నీ
ప్రాకటుఁ డిప్డు మాకడకు
వచ్చెను మా పగదీరునంచు వే
జీకటు లంతఁ ద్యాగనర
సింహునిఁ జుట్టుకొనెన్ ఛలాత్ములై.

ఉ. భూతల నిర్జరేశ్వర వి
భూతికలాపచరిత్రుఁడైన యా
నూతనలోకబాంధవు వి
నోదముతోఁ గనవచ్చి దేవతా
వ్రాతము మెచ్చి సంతత శు
భప్రతిపాదనఁజేసి మింటిలో
నాతరిఁ బట్టినట్టి కుసు
మాంజలులో యన నొప్పెఁ దారకల్.

ఉ. కోలలుఁ గత్తులుం బరసు
గొడ్డలు లుండలు దుడ్డుకఱ్ఱలున్
శూలములుం జెలంగ నడి
జుట్టులఁ బిట్టలతూలుఁ గుచ్చులుం

గ్రాల హాలారసారుణ ము
ఖంబుల నిప్పులు రాల భీకరుల్
తాళసమున్న తాంగులు వి
తర్జిత భూతచయుద్ధనాశులై
వ్రాలిరి చోరు లంతట వి
వర్జిత మానవధర్మశీలులై.

ఉ. చిందము లూఁది యూఁది వన
సీమఁ గలంచి భయంకరాకృతుల్
దందడి వెట్టి శిష్యుల న
దల్చి కదల్చి విదల్చి కొట్టుచున్
ముందుగఁ బెట్టు డందఱును
మూటలు వేగముగా నటంచు బల్
మందముగాఁగఁ జుట్టుకొన
మాన్యచరిత్రుఁడు వారి కిట్లనున్.

శా. "సందేహం పడ నేలఁ జూచుకొనుఁడీ
సన్న్యస్తులైనట్టి మ
మ్మొందం జెందదు విత్త మొక్కయణువం
తేఁ గూడ నిక్కంబు మా

యందీ క్రౌర్యముఁ జూపనేల విడుఁడ
　　య్యా యింక సత్యంత గో
విందధ్యానపరాయణుల్ వసుధలో
　　విత్తంబు నాశింతురే.

ఉ. ఆసలఁ గోసినార మశనాంబర
　　వాసము లీశ్వరస్థితుల్
దాసజనాళి కెన్నఁడును
　　దాసులమై చరియించువార మ
భ్యాసము రామకీర్తనలఁ
　　బాడుట తంబుర యాస్తి దీనికిన్
వీసము రా దొకప్పు డవి
　　వేకముతో నెవ రమ్మఁ జూచినన్."

ఉ. దారులఁ గాచి యన్యధన
　　దార పరిగ్రహణంబుఁ జేసి దు
ర్దారుణకిల్బిషంబున స
　　దా పొరలాడుచునుండు నా దురా
చారులు జారచోరులు ప్ర
　　సన్నతఁ జెందుదురొక్కొ వారికిం

గూరకు రొయ్యమీసముల
కుం గొఅగావీక నిట్టివాక్యముల్.

వ. అంత నట్టియవసరమున.

శా. "వాడా యారొ ప్రభుంగలించె వరువార్
పారుంగొ పారుంగొ యె
న్నాడా తంబి" యటన్న దుర్జనుల కు
య్యాలించి వేయాశలం
జూడన్ భక్తున కట్టివార లెవరుం
జూపట్టరై రంత శే
షాడు న్స్వామిని నేలవచ్చెఁ దతసు
ప్రీతప్రసన్నాత్ముఁడై.

శా. "రాజా! ధర్మములేని పాండురము నీ
రంధ్రంబెయూ నేఁటికిన్
వ్యాజస్తోత్రముఁ జేయుచుందురు బుధుల్
వాదేల నీతోడ నం
చో జైవాత్రుక-పేరుపెద్ద-పరభా
గోజ్జీవనాధార నీ

తేజంబెల్లను జెట్లుచేమలకుఁ గా
దే" యంచు భూదేవి తా
నోజం బక్కున నవ్వసాగెనట తా
నుత్ఫుల్ల కోకోపథన్.

ఉ. కక్కినకూటి కాసపడు
గద్దరి కాఁడుగదమ్మ వీఁడు మా
చక్కఁదనంబులెల్లఁగొనెఁ
జాలును మంచిమగండె వీఁడు మా
కెక్కడ దాపరించెనని
యిక్కలు స్రుక్కుచుఁ బోవుచుండె నొ
క్కొక్కటిగా హిమాంశునెడ
నొంటరముంగొని యట్టివేళలన్.

శా. ఎంతేఁ దత్తరపాటుఁ జెంది వనిలో
నెవ్వారినిం గానలే
కంతేవాసులఁ జెంతఁ జీరి యనువాఁ
"డాహా! కనుంగొంటిరే
కాంతావాగతులైన యాప్రభువులం
గన్నారఁగా? వారలే

ప్రాంతం బందున డాఁగినారొకో భయ
భ్రాంతాత్ములైనారొకో.

శా. ఘోరారణ్యము క్రూరసత్త్వమయమై
కూఁపెట్టు నీ జాము రే
యేరుం జొత్తురె జీవితాశ నలుసం
తే నుండినన్ మానవుల్
వా రెవ్వారునుఁ గారు దుస్తరమహా
పత్కాలబంధుప్రజల్
శ్రీరామానుజులంచు నిశ్చయముగాఁ
జింతించి కీర్తించెదన్.

భైరవి - ఆదితాళము

ప. సర్వాంతర్యామి నీవనే-సామ్రాజ్యము నిజమే రామ.

అ. నిర్వాహము లేనియీజనులక ని-నిర్మలాత్ములెటు సైరించిరోకాని

చ. దారి తెలియ లేరు కొం-దరు దరిద్రులై నారు
దురహంకారులై పరమ-నికృష్ట మతాచారులై నారు
జారులై నా రదిగాక తారు-మారు పనులు చేసేరు సం
సారులై నారు త్యాగరాజస్వాంతే-సదన కపటమేమో తెలియ

ఉ. అమ్మనుజావతంసుఁడు మ
హాటవినుండిన నేమి వాసమం

దిమ్ముగ నున్న నేమి మన.
సెప్పుడు శ్రీరఘురామ పాదప
ద్మమ్ములఁ బాయఁజాలదు గ
దా యది యొక్కటె కాచు నన్నిటన్
నమ్మిన దేవదేవుఁడును
నమ్మకపోయిన రాతిబొమ్మయే.

మ. అజులౌ నారద పుండరీక వరప్ర
హ్లాదాంబరీషాదులున్
గజరాడ్భీష్మ హనూమ దర్క భవ కా
క తుద్రభల్లూకముల్
విజయ వ్యాస పరాశర ధ్రువ శుకా
ఖీరీసహస్రంబులున్
త్రిజగద్వంద్యులుగారె? నమ్మి చెడిరే?
దీపించరే నిత్యులై?

చ. కలివశు లైనవారలకుఁ
గాసునకుం గొరగాఁడు దైవమే
"బాళ్ళొ థొకుకీజొఁణొయికొఁరి
బొబొరొపొంకొ చుడారొ స్వాదొ" ఉ

త్రోవలు సుమహాశయుల్ దెలిసి
  క్రోఁగల రిట్టి పదార్థతత్త్వమున్
అఖిలకెకాక మృగ్యము సు
  మానవభాగ్యము వానకప్పకా?

కుంతలవరాళి - దేశాదితాళము

ప. కలినరులకు మహిమలు-దెలి పేమిషల మన లేదా. క॥
అ. ఇలనునెలయునరవృష రాజులకటు-కులరుచి దెలియుచందముగాని॥క
చ. దారసుతులకై ధనమునకై యూరు-పేరులకై బహుపెద్దలనుకై
సాకెసుభక్తవేసముగొనువారికి-తారకనామ శ్రీత్యాగరాజార్చిత. క.

ఉ. లావులు దక్కె బుద్ధుల బ
  లంబులుఁ జక్కె బుతార్థతత్త్వ వా
గ్భావము లోఁడ లెక్కె నల
  పశ్చిమసీమల కింత కూటికై
సేవలఁ జేసి యన్యమత
  శీర్షులమై స్వమతంబు దిట్టుచున్
రేవగ లెట్టిసౌఖ్యమును
  లేక తపించుచునుంటి మక్కటా.

ఉ. నిత్యము సత్యమున్ దివధు
  నీ సమహా స్వమతంబునే పర

ప్రత్యయనేయ బుద్ధి గాని
'బాష'ని నెత్తిని గీటువెట్టి శా
స్త్రాత్యయ మాచరించి బహు
సంకుచితాత్ముల మైతిమే సుధీ
స్తుత్యమహా ప్రభావ జిత
సూరుల దారు లెఱుంగ నేర్తుమా.

మ. తలపం జోర జనోక్త తత్ప్రభు తిరో
ధానక్షణస్వాతిలో
గలగంబారిన సద్విశాలహృదయా
కాశ ప్రదేశంబునన్
విలసద్రాఘవనీలమేఘచపలా
నిష్ఠ్యూతభక్త్యబ్ధియ
మ్ములుగానం బకశుక్తిసంపుటయుగో
ద్భూతాస్ర ముక్తాఫలం
బులు జల్జల్లని గండభాగములపైఁ
బొర్లాడఁగాఁ జొచ్చినన్.

శంకరాభరణ - ఆదితాళము

ఎదుటనిలచితే నీయబ్బసొమ్ము లేమి బోవురా ఎ.
నుదుటివ్రాఁతగాని మట్టుమీరను-నాతరమా తెలిసి మోసపోదునా ఎ.

సరాసరిగ జూతురా నాదు అన-సరాల తెలియుము వరాలడుగజా
లరా సకలదేవరాయ, మనవి వి-నర అఘహర సుందరాకార నా ॥
విదేహజారమణ దేవ బ్రోవ నిదే-సమయ మన్యదేవతుల వేఁ
డెదే మనసు తెలియదేమి రాఘవ-ఇదేటి శౌర్యము పదేపదే నా ॥
తరానదొరకని పరాకు నాయెడ-నురామజేసితే సురాసురులు మె
త్తురా యిపుడు యీహరావిశన మే-లరా భక్త త్యాగరాజనుతనా ॥

కవి. అని యిటు లేడ్చి ప్రతిధ్వను లీన మ
హాటవియంతయు నోడుచు నె
మ్మనమున నించుక గూరుకురాఁ దన
మానినియంకమునన్ శిరముం
జనువునఁ జేరితి సైకతభూతల
శయ్యఁ బరుండిన సాధున కా
వనజవిలోచన మందముగాఁ గర
పల్లవశీతల సేవలిడున్.

ఉ. పేరెమొ వారి కాంతునకుఁ
బేరిమిమీఱఁగ సాంద్రచంద్రికా
సారముఁ జంచుపాత్రమున
సారెకుఁగూరిచి కూడువెట్టుచుం
గోరికమేర మీఱఁగఁ జ
కోరి మనోభవ శాస్త్రపత్రసం

భారము మాటిమాటికిని
బాగవిదల్చును తుక్కుడుల్లఁగన్

ఉ. మూరెఁడు సాగిసాగి నును
ముక్కును జేరిచి లోఁగిలోఁగి లో
ధీరత నీగియీఁగి పలు
తెన్నులఁబట్టుచు నేగియేగి సం
చారముఁ జేసివచ్చి రస
సాగరమందునఁ దోఁగితోఁగి సం
సారముఁ చేయు జక్కవకుఁ
జాలక రాత్రి యోడె నంతటన్

క. ఏవం విధాన భాస్వ
చ్ఛ్రీనిలసితుఁడైన త్యాగవిభునిచరిత్రల్
దైవారఁ జేయు కవిపర
కైవారములనగఁ బడగ కలరవ మలరెన్

చ. కలుష పథంబునంబడిన
కైరవమిత్త్రుఁడు వారుణీరతిన్
వెలవెలపాటుఁ జెంది యవి
వేకము వెల్లడిసేయు టబ్రమా

పలుచనయైనవాని బుధ
వారము మెచ్చునె చెంతఁజేర్చునే
నలువురిలోనఁ దత్కథలు
నవ్వులు ముప్వురిలోన ముచ్చటల్.

శా. రాగాలాపముఁ బ్రోగువోయుచు మహా
రంభోదితజ్ఞాన భా
భాగుండై ప్రకృతి ప్రభావగతి వి
ధ్వస్తాంధకారుండునై
ప్రాగుక్తి ద్విజదత్తజీవనకణ
త్రాణుండు, భాస్వన్మహా
యోగస్ఫూర్తిఁదనర్చెఁదమ్ములకు సూ
ర్యుం డంతలోఁ దోఁచుచున్.

ఉ. కట్టెఁడిజంతుకోటికిని
గల్పకభూతముగన్నతల్లియై
పెట్టుచుఁ బోయుచెల్లపుడు
బెంచుచుఁ బేరిమిమీఱి దట్టపుఁగా
నట్టడవిం బ్రభాస్వదరు
ణప్రభ తద్వనదేవతాశిరో
ఘట్టితపద్మరాగమణి
కాంతియొ, నావిలసిల్లె నత్తఱిన్.




త్యాగరాయస్వాములు

ఉ. పొంతసరోవరంబునకుఁ
బోయి, రయంబున వార్చి, భక్తుఁడుం
గాంతయు శిష్యసంతతియుఁ
గ్రమ్మరి మార్గముఁబట్టి సృష్టిలో
వింతలఁజూచి, యీశ్వరుని
వేయివిధంబులఁ బ్రస్తుతించి, యా
వంతయుఁ గష్టమొంద కొక
పల్లెను జేరిరి జాముప్రొద్దునన్.

చ. మునుకొనివచ్చి, గ్రామగుడి
ముందట గుంపులుగూడియున్న యా
జనముల గొల్లువించు, నట
సంగతి యేమని వారిలోన నొ
క్కనిఁ దనచెంతఁ జీరి, యడు
గంగను, వాఁడు విధేయుఁడౌచు ని
ట్లనె "మహితాత్మ విప్రుఁ డొకఁ
డద్భుతదైవగతిన్ గతాసుఁడ
య్యెను మఱి వాని దారసుతు
లేడ్చుచునుండిరి శోకతప్తులై.

చ. తనవిధి యెంతవానికిని
దప్పదు చూడుఁడు పీఁడు రాత్రి ని

ర్జనసమయంబునందుఁ గడు
సాహసియై యలగోడ గెంతి లో
ధనమును దొంగలాడుకొను
దామని యెంచెను కాని లోనికిం
జనకయె నూతిలోనఁ బడి
చచ్చెను దైవమహత్త్వ మెట్టిదో.

క. వడకత్త్యార్ వీఁ డప్పుడు
గుడికీవల నిలువఁబెట్టి కొడుకుల సతినిన్
వడివడిగఁ బారి నూతం
బడియెను తన పాపఫలము పండినకతనన్.

గీ. అనుచుఁ దెల్పెడు నవ్వాని నాలకించి
"బ్రాహ్మణుం డిట్టిపనులకుఁ బాలువడునె
వీనిమాటలు చూడఁగ వింతఁగొలుపు
నేను జూచెదఁగా"కని నిశ్చయించి.

సీ. తనముఖమునుజూచి కనుఁగవనీరు నిం
చెడు చిన్నికుర్రలఁ జేరఁదీసి
ప్రాణము కడఁబట్టి పడియున్ననాథుని
శిరము నిజాంకముం జేర్చిచేర్చి

ఆజానుదీర్ఘంబు లైన శిరోజముల్
భూపరాగములలోఁ బొరలియాడ
బొమ్మఁదట్టుకొనుచు రోదించి పెనుబండ
శిలలను గరఁగఁగఁ జేయఁజాలు
గీ. దానిఁ బలుమఱు హా! పాడుదైవ మెంతఁ
జేసె నాకీఁక దిక్కేది, చిన్నిపాప
లెవరివారగుదురు, మఱి యెవరికొఱకుఁ
దనువు నిలుపుట యని యేడ్చుదాని నచట.

మ. పవనోద్ధూతధరాపరాగపటలా
వారాంతరచ్ఛన్నపూ
ర్ణవిధుప్రాయముఖిన్, దవానలశిఖా
నాగాతతోత్తప్తమా
ధవినా పోలినమేను దానిని వసం
తర్త్వంతరోదత్పికా
రవవిభ్రాంతి చెలంగనేడ్చు చోకటన్
రాజిల్లు నద్దానినిన్.

చ. కనుఁగొని సాత్వికుం డమిత
గౌరవ భావము లుప్పతిల్ల "న
మ్మణి యిటుఁ జూడు నీదు యజ
మానున కెట్టి భయంబులేదు, రా

ముని కరుణాకటాక్షు మిది
మోమున జీవకళల్ నశింపలే
దు నిముసకాలమందున ని
దో తనయంతటఁ దానె లేచెడిన్.

క. కడుపుసఁజొచ్చిన నీటిని
వడివడిగాఁ బైకిఁదీసి వైచెద నిపుడే
కడఁబట్టినప్రాణం బ
ప్పుడు భాస్వత్కారకదుష్టమున గూటఁబడున్.

మ. తులసీదామము కంఠసీమను, విభూ
తుల్ నిత్యముందాల్చు జా
డలు ఫాలంబునఁ గావిదోవతి కటిన్,
డబ్బాటునం జెప్పవే
జలజాతాక్షపదారవిందభజనా
సక్తుండు నిష్కామ ని
ర్మలచిత్తుం డితఁడంచు మిత్తిభయ మ
మ్మా యేటికే పీనికిన్.

సురటి - రూపకతాళము

ప. భజనపరుల కేల దండ-పాణిభయము మనసా రామ. భ.
అ. అజరుద్రసురేశుల కా - యాస్థానమొసంగు రామ భ.

చ. అండకోట్లనిండిన కో - దండపాణిముఖమున హృ
త్పుండరీకమునఁజూచి - పూజసల్పుచు
నిండుప్రేమతోఁ గరంగ - నిష్కాములకు వర వే
దండపాలు దాసుఁడైన - త్యాగరాజుఁ జేయురాము. ధ.

వ. అని యాయమ నూఁబడించి, చేయఁదగిన యుపచా
రములన్నియుం జేసి నెమ్మనంబు నిశ్చలంబుగఁ జేసి
రామపదారవిందంబులకు సమర్పణంబు గావించి.

బిలహరి - ఆదితాళము

ప. నాజీవాధార - నానోముఫలమా నా.
అ. రాజీవలోచన - రాజరాజశిరోమణి నా.
చ. నాచూపుప్రకాశమా - నా నాసికపరిమళమా
నాజపవర్ణరూపమా-నాదుపూజాసుమమా త్యాగరాజనుతనా.

మ. అనఘుం డీతఁ డదట్టులుండ నీక
నీ యార్యుల్ మహాదుఃఖితన్
గనుగో, వత్సల నోరువావియు నెఱుం
గన్లేని యీకూనలన్
వినుకో, వారలయేడు పిట్టెమెడలన్
వేవేఁ గృపాసాంద్ర, హే

దిననాథాన్వయ దుగ్ధవార్ధిసితకాం
తీ, రామచంద్రప్రభో!

మ. తననాథుల్ సకలప్రపంచసుఖ సం
ధాతల్ భువిన్వీడి యీ
వనితారత్నము జీవితాశఁగొనదె
ప్పాటం గటా! డింభకుల్
మను చెట్టో తమతల్లిఁబోవఁ గనుగొ
మ్మా వేఁ గృపాసాంద్ర, హే
దిననాథాన్వయ దుగ్ధవార్ధిసితకాం
తీ, రామచంద్రప్రభో!

మ. తను వెవ్వారికినైనఁ జూడఁగనని
త్యంబైన గోవిప్రస
జ్జన రక్షాపరతంత్ర దీక్షకవకా
శంబేదొకో! యింక నీ
వును మాయట్టిఁడ వౌదువే శివశివా!
పూర్ణస్వరూపా! హే
దినానాథాన్వయ దుగ్ధవార్ధిసితకాం
తీ రామచంద్రప్రభో!

వ. అని యిట్లు ప్రార్థించి యూరకుండినం గొంతవడికి;

మ. బిగియం జిక్కిన ప్రాణవాయువున కా
వేళావకాశంబు లే
ప్పఁగ, భాస్వత్కరకోష్ణయుక్తి నలరెం
స్పర్శేంద్రియజ్ఞానముం
ఎగయం జొచ్చెను బ్రక్క లంతట నహా!
యించించు కావెంబడిం
నగవుం మోమున నందమై పొడమ న
న్నాయంచు నల్లల్లనం.

మ. కదలించెం బహుళప్రయత్నములతోఁ
గాళ్ళేతు లల్పంబుగా
మెదలించెం గనుఱెప్పలప్పయని యా
మ్రేడించి యుచ్ఛ్వాసముం
వదలించెం గుడిప్రక్కకొత్తిగిలి దే
వా! దేవదేవా! యటం
చదిలించెం యమకింకరప్రచయముం
ద్యాగానురాగంబునం.

మ. "అదిరా! పంచనదోద్భవాంబరమణీ!
యత్యర్థలోకత్రయీ

విదితశ్లోకవిరాజమాన!" యను చా
　　విప్రుల్ పదాక్రాంతులై
చదలన్మేటి ప్రతిధ్వనుల్ చెలఁగ "రా
　　జా! త్యాగరాజా! బుధా
స్పదభూజా! విజయీభవ త్వ" మనుచున్
　　సంరంభులై యార్చుచున్.

ఉ. ఇంతటివాని మున్ను గన
　　మెన్నఁడు; నీతఁడు నిశ్చయంబు ధ
న్వంతరి, వీనిభాగ్యమున
　　వచ్చెను, దైవమహా త్తెలుంగఁగా
నెంతటివార, మీజగతి
　　నే సుకృతం బొనరించినాము మా
యంతటివారు లేరని య
　　హమ్మతితోఁ జెడుచుంటి మక్కటా.

చ. అలసులమై సుకార్యముల
　　యందు మహత్తరఘోరపాపక
ర్మలఁ బచరించువేళ నతి
　　మాత్ర మనోంగబలంబు లొందుచున్
దలఁగొన మెట్టినష్టమును
　　దైవభయంబును ద్రోసిరాజుగాఁ

జులకనఁ జేసి చూచుచున
శుద్ధచరిత్రులమై చరింతుమే.

మ. అకటా! ఘోరనిశాతుణంబునిజ భా
ర్యా పుత్త్రవర్గంబుతోఁ
బ్రకట వ్యాఘ్రమహోగ్రదీర్ఘరవ బీ
భత్సంబుగానున్న ప
ల్లెకు, నిద్రింప రనంత తావడుగ భూ
లేఖుండు రా వాని నిం
చుకయుం బ్రేముడి నాదరించి యొకటం
జోటివ్వ లేకుంటిమే.

శా. ఓహో, భూతదయా విహీనులముఁగా
నున్నార మీరీతి దు
ర్మోహ శ్లేష్మ విలగ్నమక్షికలమే
మో శాశ్వతంబంచుఁ బే
రూహాల్సేయుచు నుండ నేక్షణమునం
దో మృత్యుదంష్ట్రాహతిన్
హాహాకారముసేసి మే న్విడచి ఘో
రాంహస్సులో మున్గమే.

మ. మన దుర్నైజ గుణానురక్తి మనదు
ర్మార్గ ప్రయాణంబులే

మనకుం దక్కుట సాధుదీనజన సా
మ్రాజ్యాధిపత్యంబుఁ బూ
నిన చక్రాయుధపాణి సంతతశుభా
నీక ప్రదానంబులన్
దనువుల్ స్వాశ్రిత లోకజాలములను
త్సాహంబు పెంపొందఁగన్

వ. అనుకొనుచు వారు పశ్చాత్తప్తులై యుండిరి.

మ. ప్రకట ప్రాకృత కిల్బిషప్రచయ వి
ధ్వంస క్షమాశాలినీ
శకునం బాతతనిత్య నిస్తులభవిష్య
న్మోక్షసంసిద్ధి క
చ్ఛకథా ప్రాపక మాత్మకుం బొడముఁ బ
శ్చాత్తాప మెంతెంత వా
రికొ! సామాన్యజనంబుకౌనె యది ధా
త్రిన్ స్వల్పయత్నంబులన్.

మ. అమలస్వాంతులు విష్ణుభక్తులు నిరీ
హాతత్పరాధ్యాత్మ వి
క్రములౌ వారల దర్శనంబె సకలా
ఘశ్రేణికిం జెంప పె

ట్టు ముహూర్తాదృత తత్సరిసక్తి నరు నా
ధ్యుంజేయుఁ బోఁగొట్టి దో
షములం "గి న్నకరోత్యహో! కథయ పుం
సాం సంగతి స్సాధుభిః."

శా. పశ్చాత్తాప పరీతచిత్తులయి వి
ప్రశ్రేణు లిట్టింగిఁ దా
మాశ్చర్యంబునఁ బొంది చూడ, హరిదా
సాగ్రేసరుండుర్ సుధాం
ధశ్చక్రాభయదాన దక్షునికృపం
ద్యాగార్య మంత్రంబునన్
నిశ్చేష్టీకృతదండ భృద్భటమహా
నీకుండు గానోపుచున్.

ఉ. ముద్దులు మూటఁగట్టు తన
మువ్వురుబిడ్డల, లక్ష్మికుద్దియౌ
ముద్దియఁ జెంతఁజేర్చుకొని
ముందట శ్రీహరిఁ బాడుచున్న యా
పెద్దను, మూఁడులోకముల
పెద్దనుఁగోని మొగంబు వానినిన్
దద్దయుఁ జూచి లేచి, కర
తామరసంబులఁజూచి, యిట్లనున్

మ. "పరమాశ్చర్యకర ప్రభావజిత భా
స్వాన్, దేవ, ధన్యోఽస్మి సు
స్థిరసిశ్రేయసభార్గవీవర నమ
స్తే పాదయో స్త్వద్య మే
సురుచిభ్రాజితమంధకారపటల
తుభ్యన్ని శాకాల" మం
చు రహిన్ భక్తుఁడు భక్తజీవనరతున్
స్తోత్రంబులం జేయుచున్.

చ. అలయక యింక నాతని ప
దాబ్జపరాగము భక్తితోడ నౌ
దల ధరియింపఁజూడ హరి
దాసవరేణ్యుఁడు నంతలోన స
ల్లలితమనస్కుఁడై నిజ ల
లాటవిభూతుల వాఁకిచ్చెఁ గొ
ల్లలుకద! భక్తివైభవ వి
లాసులసర్వసమత్వచింతనల్.

ఉ. కన్నులబాష్పపూరములు
గ్రాలఁగ నంజలిఁబట్టి "యద్దిరా!
ని న్నొకమర్త్యమాత్రునిఁగ
నేఁ దలపోయఁగఁ జాలనన్న! యా

౧౨-

వెన్నునికూర్చఁజుట్టమవు
విశ్రుతకీర్తిరుచిప్రభాష! నీ
తెన్నులు దుర్గమంబులవి
దివ్యులకైనను సూరిసత్తమా!

ఉ. నన్నిటులేవఁదీసితివ
నాథశరణ్యతఁ బోదిసేసితో
యన్న! దురాపతత్త్వయుగు
నన్నులమిన్నను జిన్నికుఱ్ఱలన్
గన్నులఁ జూచుభాగ్యమును
గల్గఁగఁ జేసిన సత్కృపామతీ!
నిన్నిఁక నెన్నఁడే న్మరువ
నేరుతుమే, వరచోళభాస్కరా!

శా. విన్నాఁడన్ భవదీయ భక్తిపదగం
భీరార్థతత్త్వంబులన్
గన్నాఁడన్ మహిమావతీర్ణజరరా
గాధాబ్ధి వౌ నిన్నిటన్
మన్నాఁడన్ బహుపూర్వజన్మకృత క
ర్మశ్రేణి పక్వంబుగాఁ
ద్వన్నామస్మరణంబుఁ జేతు నిఁక నీ
దాసానుదాసుండనై.

ఉ. నీకు, జితేంద్రియుండ వగు
నీకు, మహాద్భుతతీర్థ పాదుఁడౌ
నీకుఁ బరోపకారివగు
నీకు, విహాయసస క్తకీర్తి! వా
ణీకమలాభవాను లుప
నీతలుగా విలసింత్రుగాత నీ
వాకున కర్థయు క్తికి న
భంగురశక్తికి రక్తు లిచ్చుచున్.

చ. పరగుట విప్రవంశమున,
బట్టుటలిట్టుల వైదికాధ్వముం
దిరుగుట పుణ్యభూములకుఁ,
దీర్థములందునఁ గ్రుంకువెట్టుటల్
ధర సఫలంబులయ్యెనుగ
దా మహితాత్ముఁడ! యిన్నినాళ్లకున్
హరికృపఁ గాంచినాఁడ నిను
నంతటిధన్యచరిత్రు మిత్రుఁడా!

శా. ఏ నీశాంతగుణంబుః ఘోరకలుషా
హి శ్రేణికిం గారుడం
బే నీత్యాగము సాజవైరివనికిం
గృష్ణాధ్వ సంయోగమౌ

నేనీరామకృతుల్ నిరంతరహృషీ
కేశాను కంపాద్యుతుల్
ఆనిన్ వింటిని, కంటి నివ్యేడ, మహా
త్మా ! మంటి నేతత్కృపన్."

వ. అనుచుండ నంతలో నాతని యాలివచ్చి,

ఉ. వింటివె చంటిపాపలను
వీపునమూపున నెత్తికొంచు నిం
టింటికిఁబోయి పండుకొన
నింత తలంబిడుఁడీ యటన్నఁ బ్ర
క్కింటికి "పూడుపూడు" మని
రింతియ వీరిమొగంబులందు నా
జంటమొగంబు వేలుపట
చాలును జాలు న దట్టులేయగున్.

ఉ. అంటిన దోసమంట తమ
యంతటి శుద్ధులు గల్గరంట ము
క్కంటికి భక్తులంట! కుల
కంటకులయ్యెడు నిట్టివారినే
మంట! దయావిహీనులగు
నట్టిరు దైవమ! మీఁదు మిక్కిలిం

గంటికి నేలకే నొకటి
గా విలసింపఁగ ముట్టరెవ్వరున్.

ఉ. వింటికిఁ గొప్పదంతముల
విప్పరమేనికిఁ గప్ప లోకమే
కంటికిఁ దప్ప నీరసముఁ
గాఁ గనుపించును వీరికన్న! నా
వంటి యనాథ యెట్టు లొడఁ
బాటగు నియ్యెడ నక్కటక్కటా!
తుంటరిదైవ మెట్లు కల
దోకద చూడఁగ వీరిపాల నీ
వంటి మహానుభావుఁడు ని
వాసముఁజేయునె వీరిలోపలన్.

వ. అని.

క. ఆఁడుది కావున మిక్కిలి
గోడొందుచుఁ గడుపుమంటకోలఁది నిటులుఁ దా
నాడఁగఁజొచ్చిన యా పూఁ
బోడికి భక్తవరుఁ డిటులు బుద్ధులఁ గఱపెన్.

శా. "అకటా! శాంతముఁ బొందుమమ్మ యిఁక బి
డ్డా! విప్రలాపంబు లే

టికి, దీనార్తశరణ్యుఁడైనట్టిహరి లేఁ
డే సర్వథా సృష్టినా
టక సూత్రంబును జేతఁబూని మన యా
ట ల్సాగునే తల్లి నీ
సుకృతంబే నినుఁ గాచునంచు బ్రతుకం
జూ డింత ధ్యేఁ దెల్పితిన్.

ఉ. తామసమేలనమ్మ! హరి
దాసునికొమ్మకు నీకుఁ గూఁతురా!
రాముని నమ్మి మిత్తికి వి
రామము నెమ్మి నొసంగినట్టి నీ
స్వామిని జూచుకొమ్మదియ
చా లెవ రేమనుకొన్న నేమి నీ
గీమున సర్వమంగళవు
గా నిజసంతతిఁ గూడియుండుమా.

ఉ. ఇంతికి భూమిదేవి కణు
వేనియు భేదము కూడ దెవ్వ రెం
తెంతలు చేయుచుండిన న
సీనదయాభరిత ప్రశాంత సు
స్వాంత రవంతమైన విర
సంబును జూపునె యామె కెందు గో



౧౧౩

రంతయు వాసితగ్గనై మ
  హాభ్యుదయ ప్రతిభాసమున్నతిన్.

ఉ. సారములేని జన్మమునకు
  సారము విస్తృతమై చెలంగు సం
సారమునందె దంపతులు
  శాంతమునొందిన; వారిదే సదా
చారము; జీవయాత్ర సుమ
  సారసమాగతసర్వమంగళా
సారనిరంతరార్ద్రి సువి
  శారద రాకగదమ్మ! కూఁతురా!"

"శాన్తములేక సౌఖ్యములేదు సారసదళనయనా"

వ. అని,

ధ్రువ. సరవి నిట్టుల నమ్మహాత్ముఁడు
  సర్వదోషనిశాంతముం
బరమశాంతముఁ బొందుమంచు సు
  భద్రవాదము నించి భూ
సురకులోత్తమ పత్నికెన్నియు
  సూక్తిరత్నవిభూషలన్
గరుణతోడ నొసంగి వెడియు
  గ్రామవాసుల కిట్లనున్.

శా. "అరరే! యబ్జభవాండ మండనులు ని
త్యాముష్మికామోద వి
స్ఫురణాయోగులు బ్రాహ్మణోత్తములు శం
భుప్రాయులై రార్యుల
ట్టిరి వంశంబునఁ బుట్టినట్టి మన కొం
డే ధర్మమున్ లేదు దు
స్తర సంసారజలార్ణవంబు నెటులం
దాటంగ నిచ్ఛింతుమో.

ఉ. లోలుభులై రవంత పర
లోక భయంబును బొంద కక్కటా!
శీలము వీటఁ బుచ్చి ధన
సేవకులై చరియించి తుచ్ఛవా
గ్జాలము సేకరించి నిజ
కాలముచెల్లఁ గృతాంతకింకరా
భీల గదాప్రహారముల
బిట్టువగం బడుచుంట లేలకో.

మ. హృదయధ్వాంతపతంగ మైహికయశో
రింఛోళి నిశ్శ్రేయసా
స్పదరాజంబు జగద్ధితార్యచరితా
సారోపదేశంబు స

మ్మద సంతర్పణ ముత్తమాగ్రజనసం
పూజ్యాధివేదంబు భూ
తదయం బోలిన నీతియొండొకటి క
ద్దా మూఁడులోకంబులన్.

మ. ధరణిం భూతముఁ జేసి ము 'న్నఖిలభూ
తాన్యాత్మవ' త్తంచు నా
చరితార్థుండగు బుద్ధఁదేవుఁ డురు సం
సారాబ్ధి పోతంబుగాఁ
బరగెంగాదె జితేంద్రియత్వమున ధీ
భావ్యుండు తత్కీర్తులన్
దరమే చెప్పఁగ భోగివల్లభున కు
ద్దామ ప్రసంగంబులన్.

మ. తరుణీపుత్రకదంబవైభవ పరి
త్యాగంబునం గాదు మో
క్షరమాలింగన గాఢసౌఖ్యపదవి
శ్రాంతుండుఁ గానోపుటల్
అరయన్ వాఁడు త్రిశుద్ధి "దేహ ముపకా
రార్థం పరస్మై" యటం
చు రహింజెప్పిన యట్టులెల్లెడఁ గ్రియా
శూరత్వమున్ జూపుటన్.

ఉ. అన్యగుణక్రియానిచయ
మబ్బిన నబ్బకయున్న నొక్కటే
ధన్యులరై సుఖంబుల స
దా కొనవచ్చును సర్వభూత చై
తన్యులు మేటిజీవదయ
దైత్యవిభంజననామశక్తిచే
మాన్యచరిత్రులై సుమహి
మాపరులై యమృతాభిసారులై.

శా. ఈదుర్మోహాకృపీటయోనిశిఖ, ప్రా
వృణ్మేఘ మాలాయమా
నా దేశంబునఁగాని చల్లవడరా
దన్యంబుచే నాత్రయీ
వాదైతిహ్యపురాణ శాస్త్రచయ సం
భావ్యంబు విస్తార సు
శ్రీదంబై తనరారు ధర్మమిదె సం
సేవ్యంబు తా నన్నిటన్.

శా. శ్రీరంజిల్లెడుసృష్టి కీశ్వరునకున్
క్షీరోదకన్యాయ మే
పారం జేయుచునుండు నెయ్యదియ నా
ద్యంతంబుగా, నేది సం

సారాంభోధి నిమగ్నమానసుల పశ్చా
త్సౌఖ్య బీజంబు హృ
న్నీరేజంబున కట్టి ప్రేమమును సం
ధింపంగ యత్నింపుఁడీ.

చ. అనుపములై సమస్తనిగ
మాగమతత్త్వ రహస్యవేత్తలై
మునికుల పుంగవుల్ సకల
భూతసుహృత్తులు శాంతచిత్తులై
కనుఁగొనినారు ప్రేమమునఁ
గాక తరింపఁగరాదు దుర్భవాం
బునిధి నటంచు వారిపద
ముల్ తలఁదాల్త మభీష్టసిద్ధికై.

చ. ప్రవిమలమైన ప్రేమయను
పాశముచే సతతంబు బద్ధులౌ
శివుని హిమాచలాత్మజను
శ్రీరఘురాముని జానకిన్ స్వయం
భవుని సరస్వతిన్ మురవి
భంజను భీష్మకరాజనందనన్
దివిజవరుం బులోమజను
నెమ్మదిలోనఁ దలంచి మ్రొక్కుఁడీ.

క. కాంతాసుత కనకసుహృ
త్సంతానములం ద్యజింపఁజాలక భువిలో
నెంతేసివారలైనను
సంతాపము నొందియొంది చనినారుకదా.

ఉ. ఇంతులఁ బాయలేరు తృణ
మేనియుఁ బేదలకీయలేరు దుర్
భ్రాంతులఁ గోయలేరు తమ
వారికి సత్కృతి సేయలేరు దు
ర్దాంతు లసత్యవాదపర
తంత్రులు గీతలఁ జేతఁబూని వే
దాంతము లాడుచుందు రక
టా ! కలికాలములోని మానవుల్.

చ. అరులఁట కోర్కెలంట మొద
లంటగవాటినిఁ గోయుటంట స
ద్గురులఁట బోధలంట ! పయి
కోఁతలు కోఁతలెకాక చేఁతలా!
ఉరుతరసత్యవాద మహిమోన్నతులా
శుకభీష్మమారుతుల్
బరగిరి మూపు రట్టిరు ప్ర
పంచముపుట్టిన నాఁటినుండియున్.

## తోడి - రూపకతాళము

ప. తప్పిబ్రతికిపోవ - తరమా రామ కలిలో  త.

అ. ముప్పునవిషయతటాక - మున మునుఁగక దృఢమనసై  త.

చ. కంచుమొదలులోహ ధనకనకములనుజూచి విష-
మంచునుమరి పెంకులనుచు యెంచి యంటని మనసై  త.

౨. సంగనాచుల మానవాంగవస్త్రముల బాగుగ-
మింగురుచులకని యంతరంగమునవే నాశింపక  త.

౩. జాజిమల్లె మందారసరోజములను మానసార-
రాజపథము చేత్యాగరాజనుతుని పూజింపక  త.

చ. సతిమనసారఁ జేయు పరి
చర్యలెపో యనుకూల వాయువుల్
సుతహిత బంధువర్గములు
చూపెడు నెయ్యమెపో యరిత్ర ము
న్నత బుధలోకసంగతి వి
నమ్రత లే తెరచాప లా హరి
స్తుతి తరి యాదురంతభవ
దోషమహార్ణవముం దరింపఁగన్.

క. భేదంబులేక తర్క వి
వాదములకుఁ బోక ధర్మవాద నిరతులై
యేదే నొకగుఱిఁ గల్గి ప్ర
మోదంబున నరులు బ్రతుక ముక్తికిఁ గలవే.

వ. అని;

మాలిని. పనిగొని యిటు లార్యా
వర్తపుణ్యావనీ భూ
షణుఁ డగు నతఁ డా దే
శంబులం జేసి వారిం
దనిపి యచట నామ
ధ్యాహ్న కాలంబునందున్
గనకవసనపూజా
కార్యసంరంభియయ్యెన్.

మాలిని. పటుతరతపనాంశు
జ్వాలమాలాపరీతో
ద్భటవిటపిపరీరం
భక్లమాక్లిన్న వాహో
త్కట పరుషతరంబై
తోష్మతలం బట్టివేళం
బుటపుటఁ బడఁజొచ్చెన్
భూతజాలంబుతోడన్.

శా. అత్యంతోగ్రహుతాగ్నికల్పదిన మ
ధ్యార్కప్రభామండలీ

ప్రత్యగ్రం బగునట్టివేళ శుచిసం
పచ్ఛాలియై నారసా
దిత్యగ్రామణియారగించి యట శి
ష్యశ్రీశిష్యవర్గంబుతో
నిత్యశ్రీకరమైన పంచనదముం
జేరంగ నుత్సాహియై.

ఉ. రామకథాసుధానిధి త
రంగ సమాహితచిత్తనీరజా
తామలభూతులెల్లెడల
నభ్యుదయప్రతిపాదనక్రియా
భూమములై చెలంగుచు న
భోగతిఁ బర్వుచునుండ నంతటన్
గ్రామముఖంబుఁ బెట్టుచు
సుఖంబుగ నచ్చటివారి వీడ్కొనెన్.

మ. మరి యచ్చోటును బాసి యొక్కయెడ నా
మధ్యార్జునక్షేత్ర సు
స్థిరదుర్గాహృదయాంబుజాతలసదా
దిత్యున్ మహాలింగనిన్
వరగోవిందపురీనివాసుని మహా
భాగున్ విరాగున్-జగ

ద్గురు బోధేంద్రుని భక్తియోగపదవీ
ఘుణ్ణుండు దర్శింపుచున్.

ఉ. సాధితము క్తిలోకుల వి
శారదకీర్తులఁ బాడుకొంచు నా
శ్రీధర వేంకటేశ్వరునిఁ
జేరి నమస్కృతిఁ జేసి యాకళా
నాథుఁడు చేరె నంతటను
నాగపురంబును సర్వదేవతా
రాధిత పాదపంకజ వి
రాజితులన్ దరిసించి జాగిలన్.

శా. ఆతం డాతత భక్తిఁ గోడ నటఁ గా
యారోహణస్వామినిన్
బ్రీతుం జేసి సహస్రనామపఠనన్
విజ్ఞానభూయిష్ఠ వా
క్ప్రీతుండై యలరారి వెండియును శ్రీ
నీలాయతాక్షీగుణ
వ్రాతంబుల్ కొనియాడి చేరెను నిజా
వాస ప్రదేశంబులన్.

ఇది మధ్యభాగము

---

శ్రీరస్తు

# త్యాగరాజస్వామి చరిత్రము

అన్త్య భాగము

మ. "ఘనుఁ డీపంటవలంతి జేజె మన త్యా
గబ్రహ్మ మయ్యారె చ
చ్చిన వానిం దనమాటతోన బ్రతికిం
చెం ద్రోవలో నంట ఆ
జననాథాన్వయవార్ధిచంద్రమునిఁ దం
జావూ ర్మహారాజునై
నను నేఁగానికి లెక్కసేయఁడట వి
న్నారయ్య నిష్కామిమై.

శా. ఇన్నాళ్లాయె నెఱుంగకుంటి మవునా
నేపుట్టలో నెట్టిపా
మున్నాదోకద యెట్లు పోల్చఁగల మీ
యుత్కృష్టచారిత్రునిం

గన్నా రెంతటి ధన్యజీవనులు కా
కర్లాన్వయుల్ దంపతుల్
పున్నం బెంతయొ చేయఁగావలయు స
త్పుత్త్రుండు జన్మింపఁగాన్.

శా. ఏదోమాదిరి రామకీర్తనల నె
న్నే నల్లుకొంచుండెఁ బో
పేదబ్రాహ్మణుఁ డింటనుండి మరి యే
వృత్తిం గొనాఁ డేమి సం
పాదించంగలఁడో యితం డనుచుఁ బ
ల్మా రెన్నుకొంచుంటి మా
హా! వైవాజ్ఞ! సమస్తలోకభరిత
ఖ్యాతిం గడించెం గదా!

క. ఎత్తినది తిరిపెమైనను
జిత్తసరస్సంభవమును శ్రీరామునకున్
బత్తినొసంగు మహాత్ముల
కెత్తెఱఁగున సాటివత్తు రితరధనాఢ్యుల్.

చ. చదివి సమస్తశాస్త్రముల
సారమెఱుంగఁగవచ్చు నష్టసం
పదలఁ గడించి పెద్దయయి
వాదము లాడఁగవచ్చు నీటికిం

గొదవమె! సూటిగా నడచు
          క్రోవలె నిచ్చలు ధర్మసూత్రమున్
వదలక వస్తుతత్త్వ మన
          పాయముగాఁ దనలో నెఱుంగుచున్.

గీ. కాంచ నిది మనభాగ్యమే కాదె యితడు
జననమొందెను మన దేశముననె" యంచు
సమ్ముదశ్రుకణంబులు జల్లుమనఁగఁ
దన్నెదుర్కొన వచ్చిరి ధరణి సురలు.

ఉ. వచ్చినవారికై యెదురు
          వచ్చి కరంబుల మోడ్చి కౌఁగిటం
గ్రుచ్చి నిజాప్తబంధువులఁ
          గూర్చి ప్రసంగమొనర్చి ప్రేమముల్
బిచ్చిల సర్వభావలయ
          విశ్రుతకీర్తిధనాఢ్యుఁ డంతఁ దా
నచ్చపుఁ బూవుతేనె జడి
          యానటు లిట్టులు ముచ్చటించెడున్.

ఉ. "నాయెడ నింత ప్రేమఁగొని
          న న్నొకపెద్దనుజేసి పెద్ద లౌ
రా యిటులేగుదెంచుట క
          టా యిది యెంతటిమాట నన్ను భ

ద్రాయిత మూర్తులార సుకృ
తార్థునిఁగా నొనరింప నెంచినా
రీ యణుమాత్రుఁ డింతటికి
నెట్టులొనర్చెనో తొంటిపూజలన్.

వ. అని యిటులాడు నాయనఘునిఁ గాఁగిటఁ గ్రుచ్చి యొక్కముదిపారుం డిట్టులనియె,

గీ. "హరిహర బ్రహ్మ ముఖవాదు లనవరతము
నీమమునఁ జేయుచుండెడి రామభక్తి
దొరుక దది యెంతవారికిఁ దొంటి పుణ్య
ఫలమునం గాక నీకబ్బె భక్తవరుఁడ.

మ. వెలియైనారము సర్వలోకమునకు
న్విజ్ఞానసంపత్తికిన్
దిలధారన్విడి చీకటిం బడుచు భ్రా
తృస్నేహ భావంబులం
దలపెట్టంగ సహింప మక్కటకటా
దాస్యంబుగా కేమి మి
క్కిలి కద్దో! అరసున్నలయ్యె మరి మా
క్షేమస్థితు ల్ధాత్రిలోన్.

మ. కులమన్నేరిట భిన్నభావములు సే
 కూరె న్విచిత్రంబు! త
త్ఫలమో కొబ్బరిపోయి చిప్ప మిగిలెన్
 భాగ్యంబులా ఆరసా
తలముం బట్టినవన్న చూడు మిఁక ని
 త్యంబైన యన్యోన్య వై
రలతం బెంచుచునుంటి మయ్యా యివియే
 ప్రజ్ఞాకృతుల్మా కిఁకన్.

ఉ. లోకుల మోసపుచ్చు ధన
 లుబ్ధులకుం జెవినిచ్చి మెచ్చి చీ
కాకుల పాలొనర్తుము మ
 హా ప్రతిభాపరులైన తత్త్వవా
గాకరులం దలంపు మిది
 యా మరి తెల్వికి మూల మక్కటా
కాకినిఁ బాయసాన్నమునఁ
 గంబళి పుర్వుల నంచఁ బెంతుమే.

ఉ. కట్టము చిత్తమర్కటము
 గట్టిగ భక్తిలతాచయంబులం
బట్టము సాధుమార్గ మొక
 పట్టునఁ గాసులకై దురాశఁబో

బెట్టము మాకుఁ జూడ నవి
వేకతమఃపరిపాక మొక్కటే
చుట్టము తండ్రి యిట్టి మము
శుద్ధచరిత్రుఁడ వీవు ముట్టెదే.

క. ఓతండ్రి నీముఖాంభో
జాత వినిర్గతరమేశ సంకీర్తనముల్
మా తనివిదీర వినెదము
ప్రీతిదలిర్పంగ నుడువవే" యన నతఁడున్.

గీ. కరములను మోడ్చుచు ముదశ్రుకణము లెడలఁ
వినయవినమితగాత్రుఁడై యను "నయారె!
పెద్దలందఱు నను నొక పెద్దఁజేసి
నుడువుచుండుట తొంటి నానోముఫలము.

గీ. 'జ్ఞానలవదుర్విదగ్ధుఁడ'నైన నేను
నేర్తు నెటు హరినామసంకీర్తనములఁ
జేసి మిముఁ బవిత్రులఁ జేయనైన
సిద్ధమగు నొక్కవాక్యముఁ జెప్పఁగలను.

క. ఉండేదే యొకరాముఁడు
దండిత దశకంధరాది దైత్యస్తోముం
డొండొకఁడు లేఁడు దైవము
రం డతనిం బాడుదము విరాగము లొదవన్.



ఇట్టి

హరికాంభోజి - రూపకతాళము

ప. ఉండేదే రాముఁ డొకఁడు - ఊరక చెడిపోకు మనసా ఉ.
అ. చండమార్తాండమధ్య - మండలమున జెలంగుచుం ఉ.

.... ... ... ... ...

శా. ఆమాతా పితృభక్తి యా విమల సౌ
హార్దంబు నాసత్యవా
క్షేమం బాగురువృద్ధనమ్రతయు నా
నీకాశ మాశక్తి యా
ప్రేమం బాయనుజన్మయుక్తియును నా
విజ్ఞానతేజస్వి తా
నామాకారము లేరికెన్నఁ దరమా
నా వేయుగాంతంబులన్.

దేవమనోహరి - చాపుతాళము

ప. ఎవరికై యవతారమెత్తితివో-ఇకనైనఁ-దెలుపవయ్యా రామయ్యా.

... ... ... ... ...

ఉ. పుట్టకుఁ బుట్టి యొక్కఁడు వి
భూతుల మట్టి కదల్చి యొక్కఁడున్
దిట్టతనాన నొండొకఁడు
దివ్యపథంబున మెట్టి యొక్కఁడున్

దిట్టుచు నింకఁ గొంద ఱల
  ధీరచరిత్రము లాడినారు; నా
యట్టేడు మర్త్యమాత్రుఁ డొకఁ
  డారఘువీరునిఁ దెల్పఁజాలునే.

ఉ. రాతికిఁ జేతనంబిడిన
  రాజకులప్రవరుండు కాన నే.
కోతులమూక లెల్ల తన
  కుం బరిచర్యలఁ జేసి నిత్యవి
ఖ్యాతులఁ బొందఁ గల్గినవి
  గా! మరియట్టులుఁ గాక యుండినన్
గోతికిఁ గొండ కెంతవల
  కుంగల దంతర మింత లోర్చునే.

ఉ. నామవిభూతి భేదము ఘ
  నంబుగ నెంచి కుతర్కవాద సం
గ్రామము నట్టె పెంచుకొను
  కైతవపండితుఁ డేమెఱుంగుఁ ద
న్నామవిభూతి? యెంతటి ఘ
  నంబది? దానినిఁ బొంద మున్నుదా
నేమి యొనర్చెనో శబరి
  నే కనుఁగొందము ప్రేమ మీఱఁగన్.

ముఖారి - రూపకము

ప. ఎంతని నే వర్ణింతును శబరీ భాగ్యము    ఎ.
అ. దాంతులు వరకాంతులు జగమంత నిండియుండఁగ    ఎ.
... ... ... ... ...    ,,

వ. అనుచు నిటులు సరసంబుగఁ బ్రసంగముఁ జేయుచు వారితోడం గలసి నిజసదనంబున కేగి యాత్మాభిరాముఁడగు శ్రీరాముఁడు లేని యానిలయంబుఁ బ్రవేశింపఁ గటకటం బడుచు నంతలోఁ దన్నుం జూడవచ్చిన యన్నంజూచి యాతనికిఁ జాగిలి మ్రొక్కి వినయంబున నిట్టులనియె.—

"శా. ఆవాలుండవు సంస్కృతోక్తులకు న
న్నా నీ మహాప్రజ్ఞయున్
దైవారుం ద్రిజగంబులందు వినుమీ
తర్కంబు నాతోడుతన్
'దైవాధీన మిదం జగ' త్తనుచుఁ ద
త్త్వజ్ఞుల్ సదా పల్కరో
ఏవం నాస్తికవిప్రలాపములు నీ
కెందైన మేల్వచ్చునో!

శా. నిర్మింపంగఁ జరాచరంబుల మహా
నిష్ణాతుఁడై పెంచఁగాఁ

నిర్మూలింపఁ ద్రిమూర్తి మంతుఁడగు ఖా
  న్నిం దేవదేవుం ద్రయీ
మర్మజ్ఞుల్ గతకాములై హృదయసీ
  మం జేర్చి యేవేళ స
త్కర్మంబుల్ పచరించుచుండెద రమో
  ఘుజ్ఞానసిద్ధ్యర్థులై.

ఉ. కారణకారణం బొకటి
  కద్దని నమ్మిన యట్టి బుద్ధివి
స్తారులు దాని నాత్మలనుఁ
  దద్దయు నిల్పి భజించినట్టి వా
రేరునుఁ జెడ్డవారె? "మన
  ఏవ నృణాం ఖలు బంధమోక్షయోః
కారణ" మంట నీ కెఱుక
  గా మఱి యేటికి వాదమాడెదో?

మ. వరవాణీకలిత ప్రశస్తమతి వి
  ప్రశ్రేష్ఠ, జప్యేశ! స
ద్గురు పాదాబ్జపరాగ చిహ్నిత శిర
  స్కుండైన వాఁడొక్కఁడే
పరతత్త్వంబు నెఱుంగు నాపలుకులం
  బాటింపు "మాచార్యవాక్

పురుషోవేద" యటంచు నీ
వెఱుఁగవే బోధ్ధాన్వయగ్రామణీ!

ఉ. నిక్కమెఱుంగు విప్రరజ
నీకర! ముక్తికి రాజమార్గముల్
చక్కని వెన్నియో కలవు
సందులు దూరుట లెందు కక్కటా!
చిక్కని పాలు మీఁగడ లి
సీ యని త్రోయుచు నుప్పి నీటికై
మక్కువతోడ నాసవడు
మందులకెందును మందులున్న వే.

ఖరహరప్రియ - ఆదితాళము

ప. చక్కనిరాజమార్గములుండఁగ సందుల దూరనేల ఓమనసా చ.
... ... ... ... ...

ఉ. సుంతయు నిల్పలేక మన
సుం బరమాత్మునియందు మెట్టవే
దాంతము లాడుకొంచుఁ "బ్రభు
వా పరలోకములోని తండ్రి మాం
కింతజలంబు నన్న మిడ
వే" యని కన్నులఁదేల్చు మాత్రనే

దంతివర ప్రదాయకుని
దర్శన మబ్బునె యెందు నగ్రజా!

చ. కలియుగ భీష్మ మారుతి శు
కప్రవరాఖ్యుల నమ్మరాదు చూ
పులు నలినాక్షులందు తలఁ
పుల్ ద్రవిణార్జనలందుఁ గల్గు వా
రలయుపదేశముల్ శుభప
రంపర లీయఁగ నోపు నొక్కొ? జ
బ్బులియది గోముఖం బగునె
పోఁ బిదుకంగను బాలుకల్గునే?

ఉ. చారుపయోధరంబులకుఁ
జక్కెర మోవికి నిక్క మెన్న నో
రూరకయున్నవార లెవ
రో మరివారల దివ్యపాదపం
కేరుహముల్ స్మరించుకొని
కిల్బిషకోటిని గొట్టవచ్చు న
వ్వారిని వీరితోడఁ బోర
పాటు కదా సరిచేసి చెప్పటల్."

స. వెండియు నంత.

గీ. నీరజము హంసరాకను గోరునట్టులు
కలువ చంద్రోదయంబును వలచుభంగి
ఘనుడు గోవిందదాసను గాయకుండు
వేచికొనియుండి త్యాగయవిభుని కొఱకు.

ఉ. వచ్చినయంతలో నతని
పాదసరోరుహమందు వ్రాలి తా
వచ్చిన కార్యముం దెలిపి
భద్రగుఁడై తన గాన కౌశలం
బెచ్చిన భక్తితో నెరప
నెంతయుఁ ద్యాగయ ప్రీతచిత్తుఁడై
ముచ్చట మీఱ వాని కొక
ముక్తిపథంబును దెల్పె నిట్టులన్.

క. "అన్నా! నీసంగీతము
విన్నాడఁ విచారమెల్ల వెలువడిపోవన్
గన్నాఁడ జ్ఞానధనివగు
నిన్నిఁక సుకృతార్థినైతి నేఁడు హరికృపన్.

మ. తొలిజన్మంబున మానవుండు ధర నెం
తో గొప్ప పూజారికా
నలయుం జుమ్మిటు పాటఁబాడుకొని యా
పద్మాక్షునామాక్షరం

బుల నిత్యంబును సంస్మరించుకొనుచుం
బుణ్యాత్మకుండై భవం
బులఁ బోఁబెట్టుక శాశ్వతామృతపదం
బుం బొంద నీపుట్టువర్క.

దేవగాంధారి - ఆదితాళము

ప. సీతావర సంగీతజ్ఞానము - ధాత వ్రాయవలెరా ఓ సీ.
అ. గీతాద్యఖిలోపనిషత్సార - భూతజీవన్ముక్తుండౌటకు సీ.
చ. ఆకాశశరీరము బ్రహ్మమనే - ఆత్మారామునితో సరిచూచుచు
లోకాదులుచిన్మయమనిసుస్వర-లోలుఁడౌ త్యాగరాజసన్నుత సీ.

ఉ. కలుగవు కల్గవెల్లరకు
గానకళాభిరుచి ప్రవేశముల్
గలిగిన కొద్దిమందియును
గానరు దీన రహస్యతత్త్వముల్
ఖలులయి ఘోరదుర్వ్యసన
లంపటులై తమ ముందుదారులం
దెలియరు కాదె గాయకమ
ణీ! యవివేకతమఃపరీతులై.

ఉ. ఇచ్చకమాడి భూపతుల
మెంగిలికూటికి వాచఱించి కల్

ముచ్చుతనంబు నేర్చుకొని
మోదముఁజెంది సుసాధు నిందలన్
జొచ్చి యఘంబుఁ బేర్చి పరి
శుద్ధతఁ గొండలపా లొనర్చుచున్
జచ్చి కృతాంతదంత కరి
నప్రదరాహతులైరి గాయకుల్.

ఉ. ఇచ్చిన నిచ్చుఁగాక నృప
హీనుఁ డొకండు సువర్ణముద్రికల్
సెచ్చెర వచ్చునే యవి హ్యా
హీక సుఖాభిరతి ప్రమత్తులై
చచ్చినవారి వెంట నటు
చక్కటి దప్పొటె కాక లోభులై
సచ్చరితంబె సుమ్ము పర
సౌఖ్య మహీరుహ మూలబీజమై
తెచ్చును వన్నె వాసు లిట
ధీరతనుండిన పాటకాంద్రకుల్.

నాటకురంజి - ఆదితాళము

ప. మనసువిషయనటవిటులకొసంగితె-మారాముని కృపగల్గునో మనసా
అ. తనతలుపాకరింటికి తీసిపెట్టి-తాఁగుక్కలఁ దోలురీతిగాదో మ.
చ. తవిటికిఅంకాడఁ బోవఁ గూటి తపిలె కోతిగొంపోయెనటగాదో
చెవిటికి ఉపదేశించినటుగాదో-శ్రీత్యాగరాజనుతునిఁదలఁచక మ.

ఉ. నాస్తికుఁడైన యట్టి ద్రవి
ణాఢ్యుని మాటపదాలుకంటెఁ దా
నాస్తికుఁడౌ దరిద్రుఁ డిడు
నట్టిదియౌ తులసీదళంబె పో
శస్తతరంబు మిత్రుఁడ! ర
సజ్ఞవతంసుఁడ వీ వెఱుంగవే
నిస్తుల ముక్తికాములకు
నీరసమంచు సువర్ణముద్రికల్.

ఉ. బిచ్చము నెత్తికొంచుఁ బుర
వీథులలోఁబడి రామనామముం
బిచ్చిలుచుండ భక్తిరస
వీచిక లుల్లము పల్లవింపఁగా
నిచ్చలుఁ బాడుకొన్నరజ
నీకరమౌళి సమానమూర్తి కా
వచ్చునుగాదె గాయకుఁడు
ప్రాక్తనపాపవనీకుఠారుఁడై.

అఠాణా – రూపక

ప. భజనసేయరాదా రామ భ..
అ. అజరుద్రాదులకు సతత – మాత్మమంత్రమైన రామ భ..

ముచ్చుతనంబు నేర్చుకొని
మోదముఁ జెంది సుసాధు నిందలన్
జొచ్చి యఘంబుఁ బేర్చి పరి
శుద్ధతఁ గొండలపా లొనర్చుచున్
జచ్చి కృతాంతదంత కరి
నప్రదరాహతులైరి గాయకుల్.

ఉ. ఇచ్చిన నిచ్చుఁగాక నృప
హీనుఁ డొకండు సువర్ణముద్రికల్
సెచ్చెర వచ్చునే యవి హ్రా
ష్టీక సుఖాభిరతి ప్రమత్తులై
చచ్చినవారి వెంట నటు
చక్కటి దప్పెటె కాక లోభులై
సచ్చరితంబె సుమ్ము పర
సౌఖ్య మహీరుహ మూలబీజమై
తెచ్చును వన్నెవాసు లిట
ధీరతనుండిన పాటకాండ్రకున్.

నాటకురంజి - ఆదితాళము

ప. మనసువిషయనటవిటులకొసంగి తె-మారాముని కృపగల్గునో మనసా
అ. తనతలుషాకరింటికి తీసిపెట్టి-తాఁగుక్కలఁ దోలురీతిగాదో మ.
చ. తవిటికిఅంకాడఁ బోవఁ గూటి తపిలె కోతిగొంపోయెనటగాదో
చెవిటికి ఉపదేశించినటుగాదో-శ్రీత్యాగరాజనుతునిఁదలఁచక మ.

ఉ. నాస్తికుఁడైన యట్టి ద్రవి
ణాఢ్యుని నూటపదాఱుకంటెఁ దా
నాస్తికుఁడౌ దరిద్రుఁ డిడు
నట్టిదియౌ తులసీదళంబె ప్రో
శస్తతరంబు మిత్రుఁడ! ర
సజ్ఞవతంసుఁడ వీ వెఱుంగవే
నిస్తుల ముక్తికాములకు
నీరసమంచు సువర్ణముద్రికల్.

ఉ. బిచ్చము నెత్తికొంచుఁ బుర
వీథులలోఁబడి రామనామముం
బిచ్చిలుచుండ భక్తిరస
వీచిక లుల్లము పల్లవింపఁగా
నిచ్చలుఁ బాడుకొన్న రజ
నీకరమౌళి సమానమూర్తి కా
వచ్చునుగాదె గాయకుఁడు
ప్రాక్తనపాపవనీకుఠారుఁడై.

అఠాణా – రూపక

ప. భజనసేయరాదా రామ భ..
అ. అజరుద్రాదులకు సతత – మాత్మమంత్రమైన రామ భ.

చ. కరుకుబంగారువల్వ - కటిసీమలో మెఱయఁగ
చిఱునవ్వులుగల ముఖమును - చింతించి చింతించి భ.
౨. అరుణబింబాధరమున - సురుచిరదంతావళిని
మెఱయుక పోలయుగమునను - నిరతమునను రామనామ భ.
౩. బాగుగమానసభవ - సాగరమును దరియింప
త్యాగరాజుమనవిని విని - తారకమగు రామనామ భ."

క. ఆనతగాయకలోకుఁడు
ధీనిధి (శ్రీ) విష్ణుపద విధేయుఁ డతనికిన్
మానితమగు నుపదేశముఁ
దా నట్టు లొనర్చి పంపె దయ నైవారన్.

క. అంత నొకనాఁడతఁడు తన
కాంతం గమనీయనిఖిలకళ్యాణగుణా
క్రాంతన్ వ్యాకులభరిత
స్వాంతుండై పిలిచి పలికెఁ జయ్యననిటులన్.

శా. "ఇల్లా, రాఘవపీఠశూన్యమిది యి
న్నీ! చూడ నాబుద్ధికిం
గల్లోలాలయ మిట్టిగేహముఁ జొరం
గాఁబోల దెవ్వారి కో
యిల్లాలా! యిటురమ్ము నా పిఱుఁద ని
ష్టే పోదమా యేటికిం

దల్లిం దండ్రిని జూచుకొందము నితాం
తప్రేమ సంధిల్లఁగన్.

క. కావేరీతీరంబే
యావాసముచేసికొంద మచ్చట నా సీ
తావల్లభునిఁ గనుంగొని
యావల నరుదెంత మిటకు నబ్జదళాక్షీ!

శా. నా కేమున్నది యింటిపట్టున ? సదా
నందంబునం బొంది యా
కాకుత్ స్థుం బురుషార్థదాయకుని సిం
గారింపనా ! పాడనా ?
కాకంబ ట్లుదరంబునింపుకొను టే
కా ! అయ్యయో జన్మమా
రాకాకైరవమిత్రమండలముఖి !
రా, రావె కావేరికిన్.

ఉ. చూతముకాక వాఁ డెటులు
చొప్పడఁడో యెటు నన్ననన్యసు
ప్రీతునిఁ జేయఁడో యెటుఁ
బెంచఁడొ పెద్దనుజేయఁ డెట్టులో

ఈ తను విట్టివే తనువు
లేనియు వానికి ధారవోసి యా
పాతరలన్ని త్రవ్వదము
పంకజలోచన రమ్మురమ్మికన్."

వ. అను తన నాధునింగాంచి యా సతీమతల్లి కడు భక్తి నిట్లను:

శా. "శ్రీ రామాంఘ్రిసరోజబంభరులు ని
శ్చింతాపరుల్ బుద్ధి వి
స్తారుల్ తా రెట నుందురో యదియె సి
ద్ధక్షేత్ర మీదాసి కా
త్మారామ ల్దమరిట్లు వ్యాకులముఁ బొం
దం జెల్లునే నాథ! మీ
తీరుం జూడగఁ జూడఁగా మదికి నెం
తే భీతి వాటిల్లెడిన్.

క. ఏల నిటుమేటి వంతం
దూలెదరో నాథ! మీకు దోరికెద ననుచున్
లోలుండై యారఘుపతి
మే లొనరించుటకు నాఁడు మీతో ననఁడే.

ఉ. ఆతఁడె మీరు, మీరె యతఁ
డై యలరారుచునుంటఁ జూతు నా
చేతమునందు నెల్లపుడు
సిద్ధము సుమ్మిది యార్య! మీ ముఖ
ప్రీతికిఁ బల్కలే దిటులు
వేవురు వే విధు లాడుకొన్న మీ
చేతికిఁ జిక్కినాఁడు హరి
చింతలలోఁబడి చిక్కఁబోకుఁడీ.

శా. తన్నామంబును బాడుకొంచు మఱి ని
త్యం బేటికిం బోయి యెం
దున్నాఁడో కనుగొంట కుగ్రముగ ను
ద్యోగింత మద్దాన లే
కున్నే చేతికిఁ జిక్కకున్నె మన కీ
కున్నే మనోభీష్టముల్
భిన్నత్వం బదియేల నింక వసుధా
గీర్వాణవంశోత్తమా! ”

వ. అని యిట్లు విన్నవించుకొను నాకాంతం జూచి
యా విభుం డెంతయు సంతసించె మఱియు.

ఉ. శీలముఁ బ్రోదిసేసి నిజ
సేవలఁ జేసి మనోహరార్థవా
గ్జాలము రాసివోసి సము
ఖంబున వర్తిలుచున్నయట్టి యా
యాలిమ ఱుంగునందు విభుఁ
డాకుమఱుంగుననున్న పిందియం
బోలునుగాదె నిత్యసుఖ
ముల్ భజియించుచు నెట్టివేళలన్.

వ. అంత.

చ. జలధరదేహు నాజనక
జావరుఁ గోరి తపించుచున్న ని
ర్మలచరితుండు భానుకర
మాలికలం గడు డస్సి వచ్చె శీ
తలపరిచర్యఁ జేసికొని
ధన్యతఁ గాంచెదమంచు నెంచి యా
జలధర వల్లభుం డొలయ
సాఁగె మనోహరమంద్రగర్జలన్.

ఉ. చేరెఁడుఁ జేరెఁడై యొకటఁ
జేరుచు వచ్చిన యాపరార్థవి

స్తారుని వారివాహుని యు
దారగుణాతిశయంబు మెచ్చి కై
వారముఁ జేసెఁ జాతకి వి
వర్తముఁ జేసె మయూరి సాధుసం
చారము సర్వభూతచయ
సౌఖ్యదమై యలరారెడుంగదా!

చ. తొలకరి మబ్బుగుంపులను
దొయ్యలు లెంతయుఁ గౌతుకంబుతోఁ
గలకలలాడు చాత్మకర
కంకణ నిక్వాణముల్ మనోజ్ఞమై
చెలఁగ రతీమనోహరుఁడు
చిత్తములోఁ గలుగంగ ముంగురుల్
తొలఁగఁగఁ ద్రోసికొంచు మరి
తొంగి కనుంగొనఁ జొచ్చి రంతటన్.

చ. వదలకధీరుఁడై యిసుక
పాఁతరలన్నియుఁ ద్రవ్వుకొంచు నా
విదితయశుండు భక్తిమెయి
వేయువిధంబుల జానకీపతిం
బదములఁ బాడుకొంచు నొక
వత్సరకాలము కష్టజీవియై

పదిలముచేసె భాగవత
 భాగ్యములౌ కృతిరత్నజాలముల్.

క. అక్కడఁగాదని యిక్కడ
నిక్కడఁ గాదనుచు మఱొకయెడ నటఁగా దా
చక్కియని విసుగుఁజెందక
చక్కఁగ నదియెల్లఁ ద్రవ్వెసాఁగె నియతుఁడై.

శా. ఏరాళం బిది చెప్ప నేరితరమా
 నే యిట్టికార్యంబు కా
వేరీగర్భ మదేడ సైకతములం
 భేదించు టేనాఁటి కా
శ్రీరాము న్మరి పొందు టెన్నఁ డహహా
 చింతింప దుస్సాధ్యమే
'ప్రారబ్ధం నపరిత్యజంతి ఖలు ధీ
 రా' యంట సత్యంబెకా.

ఉ. "ఏమిటి త్రోవ యింక, నది
 నెందుల నుంటివి దేవ, కానరా
వేమిటి, కిట్టిలెంకఁ గరు
 ణింపఁగ లేవ మహానుభావ, యో

సామజరాజరక్షక! వి
శారదమైన భవత్కృపారసం
బీ మనుజాధమాధమున
కెన్నటికిం జవిఁజూప నెంచితో.

చక్రవాకము - రూపకతాళము

ప. సుగుణములే చెప్పుకొంటి - సుందర రఘురామ సు.
అ. వగలెఱుంగ లేకయిటు - వత్తువనుచు దురాసచే సు.
చ. స్నానాదిసుకర్మంబులు - వేదాధ్యాపనంబులెఱుఁగ
శ్రీనాయక క్షమియించుము - శ్రీత్యాగరాజనుత సు.

ఉ. రామనృపాల, నే జనక
రాజునె నీకొకకన్నె నిచ్చి నీ
ప్రేముడిఁ జూరకొంటకు? న
భీష్టతమై యలరారుచున్న నీ
నామము రేయియుం బవలు
నాక జపించుచు నున్న పేద న
న్నేమిటి కన్నియుం చెలిసి
యిట్టుల నట్టెలఁ బెట్టుచుంటివో.

ఉ. లావది తగ్గుచుండిన కొ
లందిఁ బలంబుగఁ దోఁచె దుఃఖముల్

నీవిధి యింతయే యనుచు
నీరసభావముఁ జూపకింక నా
కీవగఁ బాపి కంటఁబడు
మింటికి ర మ్మెదనంటుమయ్యా, దా
సావన! నందనాంకము కు
లాగత మాట మదిం దలంపుమా!

దేవమనోహారి - రూపకతాళము

ప. కులబిరుదును బ్రోచుకొమ్మురమ్మ్మ కు.
అ. ఇలఁగల భూదేవసురా-దుల కాధారుడగు నీ కు.
చ. నిగమాగమచర నీకు-నిత్యమంగళముకల్గు
వగసేయకు రామా-వందిత త్యాగరాజ కు.

చ. కఱకయి వాఁడు నీసుగుణ
గానముసేయఁగ నేరఁ డక్కటా
మొఱకు కుతర్కవాది నినుఁ
బోల్చుకొనాఁ డటులయ్యు వానికిం
దొఱకితి విట్టు లేటఁ బడి
దొర్లుచునుంటిని గొంతుపోవఁగా
నఱచుచు నుంటినైన నక
టా! కనులం బడవేమి రాఘవా!

అఠాణ - త్రిపుటతాళము

ప. ఏపాపముఁజేసితిరా నీ - కేపాపైనదయరాదు నే నే.

అ. నీపాదములనుకన మొరలిడితే-
నీపాటునవిన వినినట్లుండుటకు నే నే.

చ. నాదరూపుఁడనని విని నే శ్రీ-నాథ నినునమ్మితి నే
వరపురమునసుండిలనేన-న్నాదరింపకయూరకుండుటకు నే నే.

౨. గారవింపదయరాదా పాలు-గారుమోము చూపరాదా
యూరకుండుటమరియాదా నా-యూరఁదెల్పవారెవ్వరు లేరా ఏ.

౩. ఎందుకనుచుసైరింతునురా రామా-ముందువెనుకతోఁచదురా
ముందరనిలిచిపలుకరా నా-యందునీకు యీవఱకు మరపురా ఏ.

౪. కన్నవారిని వేఁడినానా నా-యన్ననిన్నాడు కొన్నానా
నిన్ను నమ్మినవాఁడుగానా ముని-సన్నుతకపటములన్ని నాతోనా ఏ.

౫. వినవయ్య ఇనకులధనమా రామ-నినునమ్మి యింకదురితమా భ
వనమున నీకిదిఘనమా నా-మనసిటువంటిదనుచును దెలుపుమా ఏ.

౬. సదయుఁడై యింకపరాకా నా-హృదయవాసుఁడునీవేకాక
ఇదిబుద్ధి అనుచుఁ దెల్ప లేకనాఁడు-మొదలుగానూరకున్నావుగాక ఏ.

౭. రాజశేఖర సన్నుతాంగ త్యాగ-రాజ హృదబ్జసుభృంగ
రాజితకరుణాపాంగ రతి-రాజ జనకపాపధ్వాంతపతంగ ఏ.

ఉ. అబ్బ! రవంతయైన విన
వబ్బగడించిన యాస్తివంచు నే
నుబ్బితి నిన్నుఁజూచుకొని
యుగ్రభవాగళతార! . నన్నుఁ ద

బ్బిబ్బుల పాలు సేసిత్తివి
బిట్టుగ రోసిన వాని డాసితే
దెబ్బకు దయ్యమే జడియుఁ!
దెల్లము నీగుణగాథ రాఘవా!

శా. ఇంకా నీమది చల్లవారదె కృపా
బ్ధే, సాధుసంతాన హృ
త్పంకేజార్కుఁడవంచు శంకరముఖు
ల్భాషించు తద్వాక్యముల్
శంకాసంకులమేల చేసెదవు శ
శ్వత్కీర్తి మర్త్యుండ నా
వంక ల్గిద్దు దయాంకురంబు లొదవన్
వంకం బ్రసన్నుండవై.

దేవమనోహరి - దేశాదితాళము

ప. కన్నతండ్రి నాపై కరుణమానకే గాసితాళనే క.
అ. నిన్న సేయుపనులు నేఁడుగాకనే - అన్న లేదనుచు వేమారులకుక.
చ. ఎదురితానసే యింగితంబెఱిఁగి - చెదరనీకపంచేంద్రియమణంచినీ
ఎవరలేనిధైర్యశాలిగాదనే - మదనకోటిరూప త్యాగరాజనుత క.

క. తనవారి తనములేదా?
జనకసుతా ప్రాణనాథ! సాధువినోదా!

యిన వంశరాజులకు నీ
గుణ మెన్నఁటికైనఁ గలద? కోవిదవంద్యా!

మ. కరిరాజేమిటి లంచమిచ్చె ననుచుం
గాపాడగాఁ బారి నా
వురరామా! సుగుణాభిరామ! దనుజుం
శోషించి భూషించి భా
సురలంకాపరిపాలనం బొసఁగ నీ
చుట్టంబకో యాతఁడే
పరిదానం బిడి యిట్టి భక్తజను లా
పన్నిరధు ల్దాటిరో.

దేవగాంధారి - ఆదితాళము

ప. క్షీరసాగర శయన ననుఁ - జింతలఁబెట్టవలెనా రామ క్షీ.
అ. వారణరాజును బ్రోసను వేగమె-వచ్చినదివిన్నానురారామ క్షీ.
చ. నారీమణికిఁ జీరలిచ్చినది - నాఁడే నే విన్నానురా
ధీరుఁడౌ రామదాసునిబంధము - దీర్చినది విన్నానురా
నీరజాక్షికై నీరధిదాటినదీ - నీకీర్తిని విన్నానురా
తారకనామ త్యాగరాజనుత - దయతో నేలు కోరరామ క్షీ.

మ. పగనో పెన్వగనో విపద్దశలలోఁ
బ్రాణాలపై భీతినో

ఒగి నిన్నొక్కముహూర్తమాత్రమున నో
హో రాఘవా యన్న దు
ర్భగు లయ్యారె సమస్తపాపవనముల్
భస్మంబులై పోవ భ
ద్రగు లైనారని పెద్దలాడుట లబ
ద్ధంబా ! నుతత్ర్యంబకా!

మ. క్రూరుండై కడుపారఁగన్న కొడుకున్
ఘోరార్తిలోఁ బెట్టియో
కోరీ శౌరినిఁ జూపుమంచు నెవఁడే
నున్నాఁడొకో యిప్పుడా
భారిం బాపుచు భక్తుఁ బ్రోచుటకుఁ గం
బంబందు నున్నాఁడవో
కారుణ్యాంబునిధాన నాయరపు లా
కర్ణింపఁగా లేవొకో.

ఉమాభరణ - ఆదితాళము

ప. నిజమర్మములను దెలిసినవారిని-నీవలయించేదెందుకోరామ ని.
అ. అజగజరక్షకగజచర్మాంబ-రాదిగౌణభేదములలీలకల్ల చేసిననీ ని.
చ. శ్రుతిశాస్త్ర పురాణవివాద వ-ణ్మతనిష్ఠుల నామపరాదుల
క్షితిపతులొంగ మతులుగాఁజేసిన క్షేమత్యాగరాజనుత శ్రీమనో
[హరనీ ని.

ఉ. అక్కట నేను నీమెడ ని
రాదరబుద్ధి వహించినానొకో
చక్కనివాఁడవంచు గుణ
సాంద్రుఁడవంచు రమించువారికిం
జిక్కినప్రోడవంచు నినుఁ
జేరి భజించినవారి కెన్నఁడుం
మిక్కిలి మేలు గూర్చుటకు
మేకొనినాఁడవటంచు నిన్ను నా
యక్కునఁ గట్టుకొంటిని క
దా యిది యంతయు నీవెఱుంగవో.

ఉ. నిక్కిలి నిన్నుఁజూచుకొని
నీరసలౌకికవృత్తు లన్నిటిం
దక్కితి నీపదాబ్జభజ
నారతచిత్తుఁడనై సుఖంబులన్
మెక్కితి నైనఁగాని మెర
మెచ్చుల దైవమవైతి వక్కటా
యెక్కడి ధర్మమో రఘుప
తీ తనవారిని దానె వీడుటల్.

ఉ. చూడకయుండలేను భవ
శోషణ, నీనగుమోము చందురుం

బాడకయుండలేను మృదు
భాషణ, నీవిలసద్గుణంబులం
గూడకయుండలేను రఘు
కుంజర, నీపదపద్మ భక్తులన్
వేడెద రమ్ము కంటఁబడి
వేదురునొందెడు నన్నుఁ బ్రోవుమా.

నవరసకన్నడ - రూపకతాళము

ప. నినువినా నామదెందు-నిల్వఁజే హరి హరి ని.
అ. కనులకు నీ సొగసెంతో-కమ్మియున్నది గనుక ని.
చ. నీదుకథలు వీనులందు-నిండియున్నది రామ
శ్రీద నీనామమునోట-చెలఁగియున్నది గనుక ని.
౨. నేను ఎచటఁజూచినను-నీవైయున్నది రామ
భానువంశతిలక! నీదు-భక్తుఁడనుచుఁ బేరు గనుక ని.
౩. కపటమౌ మాటలెల్ల-కమ్మనైనది నా
తపముయొక్క-ఫలము నీవే-త్యాగరాజసన్నుత! ని.

మ. తిరిపెం బెత్తుచునున్న వాఁడఁ గనలే
దే వీథి వీథి న్నిజో
దరజాయా పరిరక్షణార్థమిటె పో
దాకాల మెన్నాళ్లు? నీ
సిరిసంపత్తుల ధారవోయుమనుచుం
జేసాఁచినా నొక్కా నీ

చరణాంభోరుహ కింకరత్వమిడినం
జాలంటినే రాఘవా!

మ. కలలోనంగనుపించి నాపడెడి దుః
ఖంబెల్లఁ బోకార్చి మ్రొ
క్కులఁ గైకొంటివి నీకు నీవెకద యా
కోవూరిలో నాఁటి మా
టలు నేఁ డేమయిపోయె? నిప్పటికిఁ జూ
డంజూడ నే వచ్చి యా
ర్నెలలయ్యెంగద త్రచ్చుచుంటి నిటులే
నీకై రఘూత్తంసమా!

క. కల కలయేనా ? నాబ్రతు
కలుసై యిటు తెల్లవారునా ? నల్వురిలో
పల నగుబాటులు సేయగఁ
దలఁచితివో రామచంద్ర, ధర్మమిదేనా?

పూర్ణచంద్రిక - ఆదితాళము

ప. పలుకవేమినాదైవమా పరులు నవ్వేది న్యాయమా ప.
అ. అలుగకారణ మేమిరా రామ నీ-వాడించినట్లైయాడిననాతోఁ బ.
చ. తల్లితండ్రి భక్తి నొసఁగిరక్షించిరి-తక్కినవార లెంతో హింసించిరి
తెలిసియూరకుండేదెన్నాళ్లురా-దేవాదిదేవ త్యాగరాజునితోఁ బ.

ఉ. నిన్ననుకొంట లేటిపని
నేనొనరించి కొలంది పూజలన్
నిన్నుఁగరస్థనవ్యనవ
నీతముఁగోల్పడి వ్రేలు నాకి కొం
చున్న వివేకహీను నటు
లుంటిని బాసి శరీరలోభినై
ఎన్నటికైనఁ జూడఁగల
నే రఘునాయక, నీముఖంబులన్.

శా. ఓహో మానసమా, క్షణంబయిననీ
యుద్యోగము ల్మానివై
దేహీమానస నీరజాతవిమలా
దిత్యుం గనుంగొంటకై
యూహా ల్సేయుము నాదుమాటవిను మీ
యుర్వీప్రజాభోగ దు
ర్మోహంబుల్ నిజమంచు నెంచి చెడఁగాఁ
బోదేల యజ్ఞానవై.

మ. మనసా వేచని తోడితె మ్మిపుడె ప
ద్మానాథు లేకున్ననీ
కును నా కింతటితోడఁదీఱె మఱి సం
కోచింప కేనాఁడు వా

నినుఁ గీర్తింపఁగడంగినాఁడ నపుడే
నిన్గూడ నిర్జించినాఁ
డను ముప్పాతిక లింక నిట్టిమెడఁగూ
డ న్నిన్ను పేక్షింతునా?

చ. విడివడి ద్రిమ్మరీఁడవయి
వేయివిధంబులఁ బోదు వేమొ ప
ప్పడుకదు నీచలంబులకు
నూకొన భోగినిగాను జోగినో
జత ! నిముసంబులో నిను ర
సాతల మంటగ మట్టిపెట్టున
ప్పె డెఱుఁగు త్యాగఁ డాడునది,
బొంకొ యమోఘబుతార్థయుక్తమో.

హరికాంభోజి - ఆదితాళము

ప. చనితోడి తేవే ఓమనసా చ.
అ. కనికరముతోఁ గనికరమిడి చిర-కాలముసుఖమనుభవింప వేగమె చ.
చ. పతితులఁ బ్రోచే పట్టాధికారుని-పరమార్థమత విశిష్టానుసారిని
ద్యుతినిర్జితశతశంబరారిని-ధురీణ త్యాగరాజహృచ్చారిని చ."

వ. అని వెండియు.

మ. "మాతానాస్తి పితాపినాస్తి ఖలుమే
మాతాపితా సౌఖ్యసం
ధాతాచ త్వమసిప్రభో! రఘుపతే!
త్రాయస్వ త్రాయస్వ మాం
సీతానాథ" యటంచు నొక్కవడి యా
ర్చెన్ బెద్దగొంతెత్తుచున్
భూతంబుల్ చలియించి మాన్మెఅయనా
పుణ్యాత్మకుం డేటిలో.

మ. పరమేశుండు పరీక్షజేయు నిటులం
బల్మారుఁ దస్గార్చి యా
తురులై కేకలు వేయువారలను దో
డ్తోఁ జిక్కఁడేనాఁడు సు
స్థిరచిత్తంబు గలాఁడు వీఁ డనుచు బు
ద్ధిం దోఁచెనా వానికే
వరదానం బొనరించు భక్తజనసం
బంధంబుఁ బాటించుచున్.

ఉ. కూఁతలు మాలద్రిప్పాటలుఁ
గోకలు మార్చుట లారగింపముల్
మూతులముళ్లు వేయుటలు
ముక్కులుమూయుట లుచ్చరించుటల్

భూతులు పుండ్రముల్ వివిధ
ముద్రలఁ దాల్చుటలే జనార్దన
ప్రీతికరంబులైన నర
శే! మరి నాకమ దేల వేఁడుగా.

మ. ఋతమార్గంబు నెఱుంగఁగోరి నిజ క
ర్తృత్వాద్యహంకార వ
ర్జితుఁడై 'పాహి జగత్పతే' యనుచు సు
ప్రీతిన్ మహోద్యత్స్వరా
కృతకశ్మాఘ వినాశకారకుని నా
శ్రీశున్ సదాపాడుచున్
జితకాముండయి యున్న మానవున కే
చేఁజిక్కునా శ్రీశుఁడున్.

ఉ. కోకకు రాకకుం గడుపు
కూటికి మాటకు దేవులాడు పెం
జీకటి వోయి సుద్యుతి వి
శేషము బర్విన చిత్తవీథి భూ
లోక సురాలయంబనుచు
లోలతతోడఁ బ్రసన్నచిత్తుఁడై

యాకమలా మనోహరుఁ
డహర్నిశల న్వసియించుఁ దానటన్.

ధన్యాసి - ఆదితాళము

ప. ధ్యానమే వరమైనగంగాస్నానమే మనసా ధ్యా॥
అ. వాననీట మునుగమునుగలోని-వంచనద్రోహము లూరకపోనా
చ. పరధననారీమణులనుదూరి-పరనిందల పరహింసల మీరీ
ధరనువెలయు శ్రీరామునికోరి-త్యాగరాజు దెలుసుకొన్న రామ ధ్యా॥

ఉ. ఆస్తికబుద్ధి అందుపయి
నక్కజమౌ మతవిద్య దానిపై
నిస్తుల శేముషీపరుల
నెయ్యము వెండియు సంతతేశ్వరో
పాస్తియుఁ గల్గువాని సుగు
ణాఢ్యుని నిర్మలచిత్త పద్మమే
శస్తతరాలయం బనుచుఁ
జయ్యన శ్రీరఘురాముఁ డంతటన్.

ఉ. ఏచినభక్తిఁ దన్గురిచి
యేడ్చుచునుండిన యట్టివాని హృ
ద్గోచరుఁడై చెలంగుచున
కుంఠితమైన దయా ప్రవాహినీ

వీచికలందుఁ దేల్చి తన
విశ్రుతభక్తజనావనాంకముఁ
బ్రోచుకొనె న్సమస్త జగ
ము ల్కొనియాడుచు నుండ నెప్పుడుఁ.

ఉ. చూడఁడు కన్నువిచ్చి తన
చుట్టును మూఁగిన శిష్యకోటులం
బాడఁడు గొంతువిచ్చి యను
పల్లవి కావలి పాదపఙ్క్తులం
గోడున రాఁడు రాఁడను ని
గోయను నుత్కట దుష్కృతాబ్ధికిన్
బాడబుఁడైన రాఘవునిఁ
బట్టితిఁ బట్టితి నంచుఁ బొర్లెడున్.

వ. వెండియుఁ గొంతవడికి.

గీ. తనపురాకృతకర్మసం తానమెల్లఁ
దుడిచివైచెనో కోయనఁ దొడరి యతఁడు
లేచి బహుసాంద్రఘర్మవి లిప్తఫాల
తల మతి మనోహరంబుగఁ దడవి తుడిచి.

శా. "ఓహో! దాశరథే, దయాజలనిధే,
ఉన్నావు నాపాల సం
దేహం బెన్నఁడు లేదు నిక్కముగ నీ
దీనుం గటాక్షించి నా
వాహా! నీఋణమెట్లుతీర్తు రఘునా
థా, నేఁ దృణప్రాయుఁడన్
దేహిన్ మూర్ఖులలోన మూర్ఖుఁడను వై
దేహీమనోరంజనా!"

గీ. అనుచు జలములలో దిగి యతిముదమున
స్నానమొనరించి యంత శిష్యప్రవరులు
భక్తి నిచ్చిన దోవతిఁ బంచఁగట్టి
పుండ్రములఁ బెట్టి యట మఱి భూసురుండు.

క. మతిపోయినట్టి మానిసి
వితమున నడయాడి యొక్క వింగడమగు పై
కతమెక్కి నిర్భరంబగు
కుతుకముతో దానిఁ ద్రవ్వ కొని యద్దానన్.

ఉ. మత్సరచిత్తుఁ డగ్రజుఁ డ
మాంతముగా నడురేయి నెప్పుడో

వత్సరకాలపూర్వమునఁ
బారఁగవైచిన యాపవిత్రకా
కుత్‌స్థునిపీఠమట్టె కను
గోఁగలిగెంగద వాగతీత నే
త్రోత్సవము ల్సెలంగ మహి
మోన్నతదివ్యచరిత్రుఁ డంతటన్.

మ. "రమణీ, ధన్యుల మైతి మింక నిటు రా
ర"మ్మంచు నానందబా
ష్పము లేత్రై ప్రవహింప మానసము ప
ర్వక్షీరపాథోధిమై
యమరం బూతశరీర మెల్లెడల రో
మాంచప్రకీర్ణంబుగా
నమలస్వాంతుఁడు కెవ్వుమంచు నొకటే
యార్పార్చుచు న్వ్రాండియున్.

చ. తమకముమీఱ నాపరమ
దైవతపీఠము నానతోత్తమాం
గమున ధరించి భక్తిమైఁ
గన్నులఁ బల్మఱు నద్దుకొంచుఁ జి

త్తము తమిదీఱఁ జూచుకొని
దాశరథే యని పాడియాడి వి
త్తమ వినుతుండు సర్వోపరి
తాపదవాగ్నులు చల్లవారఁగన్.

శా. "నీవెంతో సుకృతంబుఁ జేసితివిగదే
నిక్కంబుగాఁ దల్లి, యో
కావేరీ, జనకాత్మజావరుని నీ
గర్భంబునం బెట్టి కొ
న్నా వీవత్సరకాల మిం కిడు మను
జ్ఞల్ దీనుఁడౌ వీనికిన్
దేవీ" యంచు నిజాంగనామణియు నం
తే వాసులుం గూడిరాన్.

క. "ధీరాగ్రగణ్య, రాఘవ,
రారా, మా యింటిదాఁక రమ్యముగా సిం
గారింతుఁ బాటఁబాడి స
మారాధన మాచరింతు ననవరతంబున్.

క. నను నిఁక విడనాడకు మీ
యనుభవమే చాలుఁజాలు నయ్యా, రఘుపతీ!"

యనుచు గృహాభిముఖుండై
చనుదేరఁగ నున్నయట్టి సమయములోనన్.

శా. ఎంతే నబ్బురపాటుఁ జెందుచు నయం
బేపారఁగా నీ శుభో
దంతం బంతయు నాలకించి పెరచేఁ
తల్మాని సంసక్తులై
యంతం బంచనదంబునందుఁగల వా
రాబాలగోపాల మా
శాంతానందనుఁ జూడవచ్చి రమితో
త్సాహంబుతో నేఁటికిన్.

క. "ఆజన్మ శుద్ధచరితుఁడు
తేజోనిధి యీతఁ డద్వితీయుండు సుధీ
పూజాభాజనుఁ" డనుచుం
బూజించిరి త్యాగవిభుని ముందుగ వారల్.

క. రూపములేని జగత్పిత
తాపత్రయరహితులైన దాసజనులలో
రూపించి లోకమునకుం
జూపట్టుచునుండుఁగాదె శుభకారణుఁడై.

గీ. వేదపారగు లార్యులు వీర్యపరులు
శాస్త్రకోవిదు లాత్మవిజ్ఞానధనులు
భక్తిపరులయి తనచుట్టు బలిసికొలువ
నుల్లసిల్లుచు మరియు మహోత్సవమున.

శా. ఆనందంబున నారఘూద్వహున క
ర్ఘ్యార్ఘ్యంబు పంచామృత
స్నానంబు న్సమకూర్చి దివ్యపరిధా
నంబు న్సమర్పించి మి
త్రానీతాంచిత పుష్పచందన సుగం
ధ ద్రవ్య నైవేద్యముల్
పానీయంబులు బెట్టి పూజనల శ
శ్వద్భక్తితోఁ జేయుచున్.

ఉ. ఆమెయి నాఁడు తాను విన
యంబునఁ గూర్చిన సూక్తిహారిక
స్తోమముఁ దాల్చి చల్లవడి
తుంటరిదారిని మాని యాస్తిక
గ్రామణియైనవాఁడు తన
యగ్రజుఁ డందఱికంటె ముందు విం
జామరమూని యట్టియెడఁ
జయ్యనఁ జెప్పఁగ స్వస్తివాక్యముల్.

క. ఇరుకెలఁకుల ముదిపారులు
వెరవుగ మరి వేదఘోష వెట్టుచు నుండన్
గిరికొని పంకజవదనలు
కరమరుదుగఁ బట్ట మేలికపురపు దివ్వెల్.

క. అనిమేషస్థితిఁ దాలిచి
కనుఁగొన నందఱును నిత్యకల్యాణ మయా
త్మునిఁ బుష్పవాహనా రూ
ఢునిఁగా నొనరింపుచుం బటుక్షేమముతోఁ.

క. పరమానందము నొందుచుఁ
దిరువీథులఁ ద్రిప్పిత్రిప్పి తెచ్చి నిజగృహాం
తరమునఁ బునః ప్రతిష్ఠితుఁ
గ రహిఁ జెలంగుచు నొనర్చెఁ గాంతయుఁ దానున్.

క. అదనెఱిఁగి యపుడు సుందర
ముదలయ్య రొసంగినట్టి మొహరీలను గ
ట్టెదుట నిడి శిష్యు లాతని
పదపద్మములందు వ్రాలి భయభక్తులతోన్.

ఉ. "ఏము భవద్ధనంబును గ్ర
హింపము వద్దనినన్ ససేమిరా

ఆ మహితాత్మకుండు వినఁ
    డయ్యా, పదంపడి పెక్కుభంగులన్
మా మది బోధఁ జేసి యిది
    మానక మాకడ డించిపోయె నో
స్వామి! క్షమింపుఁ డాపరమ
    భక్తుఁడు మీ ప్రియమిత్రుఁ డేకదా!

శా. ఈరీతిం దనశిష్యులాడవిని యెం
    తే నొచ్చుకొం చాత్మలో
శ్రీరామార్పణ మస్తటంచు గ్రహియిం
    చెం దద్ధనం బందునం
గూరాకైనను వెన్కఁ బెట్టుకొనకా
    గోత్రామరుం డంతయున్
శ్రీరామార్పణ మాచరించి యొనరిం
    చె న్విప్రసంతర్పణల్.

చ. సురుచిరభక్తి తత్పరతఁ
    జొక్కుచు రామునిఁ బాడికొంచు నే
యరమర లేక నిర్మల గృ
    హవ్రతముం దలఁదాల్చి గౌరవా
దరముల నించి చోళవసు
    ధాస్థలిలోఁ దల మానికంబులై

పరగుచునుండఁ జొచ్చిరి శు
భంబుల నొందుచుఁ బెద్దకాలమున్.

శా. ఈమాడ్కిం గృతకృత్యులై సతియు భూ
బృందారకుం డుండుచో
ప్రేమంబారఁగ వారిగర్భమున నా
విజ్ఞానవైరాగ్యముల్
భూమి న్మానవదేహము ల్గొనియెనే
మోనాఁగ జన్మించిరా
రామా లోకలలామ కిర్వురుసుతల్
రాజీవపత్రేక్షణల్.

మ. పలులీలల్ చెలువంపుమాటలను ను
ద్భాసిల్లు భాలేందులే
ఖల భూలేఖకులావతంసుఁ డమిత్రో
త్కంఠంగనుంగొంచు "నో
యలరుంబోఁడిరొ, కంటివే మనకు భా
గ్యంబబ్బె నీయార్యమా
న్యలమూలంబున నీశ్వరేచ్ఛ యిది క
న్యాదానపుణ్యంబు మా

కు లభించెంగద" యంచు నిచ్చలును వా
క్రుచ్చుc నిజార్ధాంగితోన్.

ఉ. శీతమయూఖుని న్మిగులc
జిందఱవందఱ సేయcజాలు నా
కూcతుల భూసురుండు తన
కుంగల యల్పధనంబుతో హరి
ప్రీతిగ ధారవోసె వర
విప్రుల కిర్వురకున్ ధరామర
వ్రాతము తమ్ము మే ల్బళి సె
బాసని సన్నుతి సేయ నెల్లెడన్.

చ. ఇదు నొకc డుత్తమాంబరము
లింకొకc డిచ్చు సుభోజ్యవస్తువుల్
తొడవులొసంగు వేఱొకcడు
ద్రో వలcగట్టి ధరామరాళులన్
గుడుపు మఱొక్కరుండు సమ
కూర్చు మఱొక్కcడు భూరిదక్షిణల్
నడపు సమస్తలాంఛనము
ల న్మఱియొక్కరుc డట్టివేళలన్.

చ. ఉడుగక శ్రీహరిందలఁచు
నుత్తమచిత్తుల కెట్టులైనఁబో
అడుగకయే లభించును గ
దా! నిఖిలార్థము లెట్టివేళలం
బుడమిని వారిపై సకల
భూతములున్ దయఁజూపి కార్యముల్
గడపుచునుండు నాతతసు
ఖంబులఁగూర్చి యశంబుఁ బేర్చుచున్.

ఉ. అంత సకాలమందు దమ
యల్లుర నిర్వురఁ జేరఁజీరి సు
స్వాంతులు దంపతుల్ వినయ
సంభ్రమపూరిత వాక్యజాలముల్
దొంతులువెట్టి కూఁతుల ని
దోయని వారల కప్పగించి యొ
క్కింత మనస్సుల న్వగచి
యిట్లని రౌనది సాజమేకదా.

చ. "కొడుకులు లేరటంచు నను
కొంటమెలే దెపుడైనఁ, గూఁతులే
కొడుకు లటంచు నెప్పు డను
కొందుము నాయనలార! మీరె మా

కొడుకుల రిప్డు నిక్కముగఁ
గోడళులే మరి వీరు మాకు నీ
బుడుతలకత్తలిండ్లె యిఁకఁ
బుట్టినయిండ్లని యెంతు మెంతయున్.

ఉ. చెప్పట కేమియుండును వి
శేషముగా మిమువంటివారి కీ
తప్పులకుప్పలంగొని య
థావిధిగా సవరించుకొండు మీ
కిప్పని తప్పరానిది మ
హీసురపుంగవులార! వీరలే
యొప్పులునేర్చినన్ సుకృత
ముండును మీకెకదా సదా ధరన్."

మ. అనుచుం బ్రేముడి మీఱఁగాఁ బలికి యా
యల్లుండ్రతోఁ గూఁతులం
గని యాదంపతు లాత్మలో వగచి దీ
ర్ఘశ్వాసము ల్పుచ్చి "యో
యనుఁగుం బుత్రికలార! మీవలన మే
మాముష్మికానందముం
గొన నున్నారము తథ్య మీపలుకు నా
కొండ్రేకదా శ్రద్ధతోఁ.

ఉ. ఇచ్చట నింతకాలము ది
నేశకులాభరణుండె దైవమం
చచ్చపుభక్తితో నెటుల
నాతని పూజలఁ జేసిరో యటే
నిచ్చలు నింకమీఁద నతి
నిష్ఠ భజింపుఁడు మీరు భర్తలం
దెచ్చను మీకు నిర్మలన
తీత్వమె శాశ్వతసంపదాళులన్.

క. శ్రీమద్రామాయణకథ
నామూలాగ్రముగఁ జదువరా సుతలారా!
యేమేమి సేయవలెనో
మేమా తెలుపంగవలయు మేకొని మీకున్."

చ. అని యటుచెప్పి ప్రేమమున
నక్కునఁ జేర్చి నిజాత్మజాతలం
దనిసి తదాత్మభర్తల య
థావిధిగా నొక పుణ్యకాలమం
దునఁ బయనంబు సేయుఁడని
తోడుగ శిష్యులనిచ్చి కొందఱన్

బనిచిరి పుణ్యదంపతులు
భద్రముగా సరివార లౌనన్.

గీ. పుత్రపౌత్రాభివృద్ధులఁ బొంది సుతలు
విబుధమాన్యచరిత్రలై వెలయుచుంట
వినుచు మరియును గనులారఁ గనుచు నమిత
హర్ష మొందుచునుందు రయ్యాలుమగలు.

మ. "అతివా! నీవును నేను ధన్యులము సు
మ్మా శ్రీహరిం గూర్చి చే
సితి మెన్నేనియుఁ దీర్థయాత్రలను సం
సేవించినా మార్య సం
తతి వీటన్నిటికంటె ముఖ్యముగ నీ
తా భర్త చేఁజిక్కె నీ
సుతలుం గీర్తి ధనాఢ్యలైరికద" యం
చుం బల్కుకొం డ్రాల్మగల్.

క. సరసాగ్రేసరులౌనను
వెరవునఁ బ్రహ్లాదభక్తవిజయము నౌకా
చరితమునను కావ్యంబుల
విరచించె ధరామరుండు వెండియు నంతన్.

క. బృందావనవాసము గో
విందపదాబ్జాత సేవ విశ్వజనీనా
నందమతులైన సాధుల
పొందుఁగలిగియతఁడహములఁ బుచ్చుచునుండున్.

చ. వివిధసుమంబుల న్వెదకి
వేసరి మాధవుఁ బూజసేయు మా
నవతిలకుం డయారె హరి
నామ సుమంబుల నంతనుండియుం
బ్రవిమలమానసుం డగుచు
బాగుగ రామునిఁ బూజసేయుఁ దా
నవనవభావ కల్పనల
నాదముఖంబునఁ జూరలిచ్చుచున్.

## శ్రీరాగము - దేశాదితాళము

ప. నామకుసుమములచేఁ బూజించే-నరజన్మమే జన్మము మనసా-నా.
అ. శ్రీమన్మానసకనకపీఠమున-చెలఁగఁజేసుకొని పరశివరామ-నా.
చ. నాదస్వరమను వర-నవరత్న పువేదికపై సకలలీలావి
నోదునిఁ బరమాత్ముని శ్రీరాముని - పాదములను త్యాగరాజ
[హృద్భూషణుని నా.

క. తన యూరివారి నేమమె
తన నేమముగాఁ దలంచి ధన్యచరిత్రుం

డనుదినముఁబోయి వారిం
గనుఁగొను నొకవేళ నాత్మకాంతాయుతుఁడై.

క. ఎందెవరిఁ గనినవారికి
వందనమిడి పాడి యాడు బ్రహ్మవిదుం డా
నందమయుఁడై శరీరము
నం దిసుమంతైనఁ దెల్వి యరుదై యెడలన్.

ఉ. వానికి లోకబంధువయి
వర్తిలుచుండిన వాని కాత్మ వి
జ్ఞానవశంబునం బొడమె
సర్వమయం బని రామతత్త్వ మ
ద్దాన సమస్తలౌకిక వి
ధానముల న్విడనాడి సంతత
ధ్యాన పరాయణుం డగు
చహర్నిశలుం జరియించువాఁ డొగిన్.

క. అంత నొకసమయమున నా
శాంతానందమునిఁ బాసి చనియెను దివి కా
కాంతాలలామ యకటా
యింతటికష్టంబు వానికెట్టులు గలిగెనో.

శా. సంసర్గంబులనెల్ల వీడికొని ని
స్సారంబుగాఁ దోఁచు నీ
సంసారార్ణవముం దరించుటకు ని
చ్చంబూనినాఁ డచ్ఛవి
ద్వాంసుండే యతఁ డైనఁగాని నిజకాం
తారత్ననష్టంబునన్
హింసం బొందకయుండునే ప్రకృతి కెం
తేని న్విరోధంబుగాన్.

వ. అట్టియెడ నమ్మహాశయుండు నిజార్ధాంగి నుద్దేశించి,

బిలహరిరాగము - ఝంపతాళము

ప. తొలిజన్మమునఁజేయు-దుడుకుదెలిసెను రామ తొ.

అ. నీమహిమఫలమేమొ-అరచేతిపుంటి కద్దమువలెనా తొ.

చ. రాగిపయిరులచెంప-రవ్యమా వరిమొలక-రాజిల్లనేర్చునటరా
నాగశయన-త్యాగ రాజపాపములోను - నామపుణ్యముచెల
[గునా నేను తొ.

మ. జనియించెం గలశాబ్ధి కుద్దియగు న
చ్ఛంబైన వంశంబులో

ననుఁ జేపట్టినదాదిగా నిమునమై
నం బాయ దేనాఁడు నా
కనుసన్నం జరియించె నిచ్చలును ని
ష్కాపట్యభా ప్రేమతో
మనియెన్ దేవుని మారుగాఁగ నను స
న్మానించి పూజించుచున్.

శా. "కాంతాలోకమతల్లి! నీవలన నా
కంబయ్యె నీయిల్లు నీ
కాంతుం డెంతటిపేదవాఁడయిన శ
క్రప్రాయుఁ డయ్యెంగదా
శాంతారాములు నిన్ను సంతతమునా
శీర్వాదముల్ చేయుచుం దా
మెంతో ప్రీతిదలిర్పఁ జూతురుకదా
యేణాక్షిరో యెల్లెడన్.

శా. ధన్యంబయ్యెను నీదుపుట్టు విల నో
త్యాగేశ్వరీ! యింక నీ
శూన్యావాసమునందు నిన్గురిచి యే
శోకించు చిట్టుంట సా

మాన్యంబే సకలాశలుం దెగియె శా
మారత్నమా! నా కికన్
సన్న్యాసంబునఁగాని చల్లఁబడ వీ
షణ్మాత్ర మీతాపముల్."

మ. తొలిజన్మంబులయందు నాటిన మహా
దుష్కర్మబీజంబు లీ
ఫలమిచ్చెం బ్రకృతంబునం దిటులు దే
వా! కర్మగుండౌచు న
న్యాలపై నేడువనేల యింతకును ధ
న్యం డెవ్వఁడో యీగృహ
స్థులలో? నందఱు దుఃఖభాక్కు లిఁక నా
శోకంబుతో నేటికిన్.

గీ. నీవ నేనని మది నమ్మి నిశ్చయముగ
మానినీమణి కొలిచె నేమఱక నన్ను
అట్టిదానికి మోక్షము నట్టెయొసఁగు
మనుచు మ్రొక్కెద నోరామ! యఘువిరామ!

వ. అని చింతించి యాత్మదైవము బ్రార్థించి యొక
సమయమున శిష్యసంతానములం జెంతకుఁ జీరి
యా పురుషవరుండు కరుణాతిరేకంబున నిట్టులను.

మ. "తనుమధ్య న్వాడి యయ్యలార! కనుఁడీ
త్యాగయ్య ని ల్లొంటిగా
మనుమంచుం బరమాత్ముఁ డాజ్ఞయిడె నా
మాటట్టు లుండంగ మీ
జనయిత్రి న్మరపించి పెంచుననుచు
న్మీరందు రేయంగనా
మణినిం గూరిచి యట్టియామె నిఁక నే
మాడ్కిం గనఁగావచ్చునే.

క. కొడుకులు లేరను గోడుం
గుడువక యెన్నఁడును మీరె కొడుకులరంచుం
గడుపెఱిఁగి మిమ్ము నందఱఁ
గుడువంగాఁ బెట్టునట్టి గుణమణిపోయెన్.

ఉ. దానిదినంబు దీఱె నిఁక
దానిని బాసిన భాగ్యహీను నీ
దీనుని భారమంతయు ని
డె యిఁక మీపయి నున్నదయ్యా! నా
పూనిన రామపీఠ మిది
పూర్వులనుండియు వచ్చుచున్న ది

ద్దానిని మీ కె యిచ్చెద ము
దంబునఁ బూజలు సేయుచుండుఁడీ.

మ. పదిరెండేండ్ల వయస్సునుండియును నా
పట్టై సదాసౌఖ్యసం
పదఁ జేకూరిచి యుత్తమార్గముల సం
పాదింపఁగాఁ జేసి నా
హృదయధ్వాంతము రూపుమాపి మరియె
న్నే నాపద ల్బాపిన
ట్టిది యీపీఠమె యట్టిదీనినిఁ గొనుం
డీ ప్రీతితో నిచ్చితిన్.

మ. అలనాఁ డగ్రజుఁ డుగ్రకోపభరితుం
డై యర్ధరాత్రంబునం
దిలుదాటించినఁ బాఱవైచినను న
ట్టేటం గటా! నన్ను న
వ్వలపా ల్సేయగఁ జూచిన స్మరల మ
త్ప్రాణ్యాంబునం జిక్కి పు
వ్వుల పాల్సేసెను నన్నుఁ దన్మహిమ ల
బ్బో!! వర్ణనాతీతముల్.

క. వేయేల యుసురులైనను
బాయుట కొప్పితినిగాని పదపడి దీనిం
బాయుట కొప్పఁగలే దో
నాయనలారా! నిజముగ న న్నెఱుఁగరొకో.

చ. అలయక, యిట్టి దీని మద
నంతరకాలములందు భక్తిసం
కలితమనస్కులై కొలువఁ
గాఁ దగువారలు మీరె యంచు
నా తలఁచినదంతయుం బరమ
తథ్యమ యయ్యెడుఁగాక మిమ్ము ని
శ్చల కరుణాకటాక్షముల
సంతత మాహరిఁ బ్రోచుఁ గావుతన్.

క. రామసమారాధనముం
బ్రేమముతోఁ జేయుఁ డీరు విత్తాదులకై
యేమియు లోపము గలుఁగదు
నామానస మిట్లు చెప్పె నాయనలారా!

పంతువరాళి - రూపకతాళము

ప. అప్ప రామభక్తి యెంతో-గొప్పరా, మా
అ. త్రిప్పటలను దీర్చి కంటి-రెప్పవలెను గాచును మా

చ. లక్ష్మీదేవివలచునా-లక్ష్మణుండు గొలుచునా
సూక్ష్మబుద్ధిగల భరతుడు-చూచిచూచి సొలుసునా య.
౨. శబరియెంగిలిచ్చునా-చంద్రధరుఁడు మెచ్చునా
అబల స్వయంప్రభకు దైవ-మచలపదవి నిచ్చునా-మా య.
3. కపి వారిధిదాటునా-కలికి రోట గట్టునా
అపరాధ త్యాగరాజు-కానందము హెచ్చునా-మా య.

శా. మీరే నిశ్చలభక్తియుక్తులగుచు
న్నేమేటిల్లినఁ మీకు నా
శ్రీరాముండె సమస్తకార్యములలోఁ
జేదోడు వాదోడగున్
రారాజు ల్పదచారులై యిటకు శ్రీ
ఘ్రంబే మహావస్తుసం
భారంబు ల్గొనివచ్చి యిచ్చి మరి సం
భావింతు రీపీఠమున్.

చ. తవిలి యథోచితంబులగు
ధర్మువులెల్ల నెఱింగినారు మా
ధవచరణాబ్జము ల్గొలిచి
ధన్యులలై సుఖయింపుఁ డీరు మా

గు: 3

నవతకు సార్థకంబదియ
నా ప్రియసోదరలోకులార! మీ
ప్రవిమలగేహముల్ శుభప
రంపరలం దనరారుఁ గావుతన్.

ఉ. నాయనలార! సర్వసుగు
ణంబుల ప్రోవులు మీర లెంతయుం
జేయఁగలారు ధీబల వి
శిష్టుల రైననుఁ బెద్దవాఁడనై
మీయెడఁ గల్గు నెయ్యమున
మేటిలి చిన్నహితోపదేశముం
జేయుదు దానినిం బరిహసిం
పరు మీ రను నిశ్చయంబునన్.

ఉ. నేరిచినట్టి గానమున
నిర్మలచిత్తముతోడ నీశ్వరుం
గూరిచి మేటికీర్తనలఁ
గొంకక పాడుఁడు కాని యీ ధరా
భారకులైన భూపుల స
భాభవనంబులయందు దారుచుం

దీరని రిక్తకోరికెలఁ
　　ద్రెక్కొని పాడకుఁడయ్య యెన్నఁడున్.

ఉ. వారికి దైవచింతన న
　　భంబునఁ బూవటులౌట నింక మీ
శ్రీరఘురామకీర్తనలు
　　చెల్లవు యౌవన కామినీజనా
కార విశేషవర్ణనము
　　కర్ణరసాయన మన్నలార! వే
సారకుఁ డెన్నఁడట్లు పర
　　సౌఖ్యముఁ గోరితిరేని మీమదిన్.

వ. మఱియును,

చ. వెలలను నిర్ణయించుకొని
　　విక్రయమెన్నఁడుఁ జేయఁబోల దీ
కళ నిఁక దీనివల్ల నె సు
　　ఖంపఁగఁ గోరెదు ధన్యమూర్తికిన్
సలలితచిత్తుఁడున్ సులభ
　　సాధ్యుఁడునై చరియించునట్టిఁడే

యలయక పొందఁగల్గుఁ బరు
షార్థములన్నియు నొక్క మారుగాఁ.

వ. అదియటులుండె నింక మరియొక యంశంబును వివ
రింతు:

ఉ. చిత్తసరోభవంబు రస
సిద్ధినిఁ బొందినచోఁ దనంతఁదా
నుత్తమగానరూపమున
నుబ్బి యపూర్వముగాఁగ శ్రోతలం
దత్తి తదంతరాత్మలను
నప్రతిమాన నిజస్వరూపముం
జిత్తరువట్లు చూపు నిది
సిద్ధము నాయనలార! తెల్పితిన్.

మ. వివరింపన్ రసహీనమై చనెడు న
వ్విద్వాంసు పట్కాలప
ల్లవికంబెన్ రసపూర్ణమై నెగడు బా
లారోదనం బెంతయుం
జెవి కింపై యెటువంటి రాతిమనసున్
క్షిప్రంబుగా నద్దిరా

ద్రవరూపంబును బొందఁజేయు నిది సి
ద్ధంబే కదా చూడుఁడీ."

వ. అని యి ట్లనేకవిషయంబులను శిష్యజనంబులకు
బోధించుచు:

మ. అమలస్వాంతుఁడు వృద్ధుఁడై గడపి యి
ట్లష్టోత్తరాశీతి వ
ర్షము లొక్కమ్మడి మేటిపూజ్యులకుఁ బూ
జాభాజనుండౌచు నా
కమలాప్తోడుమృగాంకమై నెగడు వి
ఖ్యాతిం గడుం జేర్చుచున్
సమయజ్ఞానముఁ గల్గి పుచ్చుకొనియెన్
సన్న్యాస మా పిమ్మటన్.

వ. శిష్యులం బిలిచి తన కానాఁటి కేడవదినంబున సిద్ధి
నొందవలసియుండుటం దెలిపి యందఱి వీడ్కొని.

చ. విబుధవరేణ్యులౌ పుడమి
వేల్పులు భక్తిపరీతచిత్తులై

ప్రబలి తనుం భజింపఁగఁ బ
రాభవనామకవర్షమందుఁ బు
ష్యబహుళపంచమీ సుదివ
సంబున సిద్ధినిబొంది యేగె నా
త్మబలమున న్మనీషి జన
మండనుఁ డద్భుత కార్యకారియై.

ఇది అంత్యభాగము

శ్రీత్యాగరాజస్వామి చరిత్రము
సంపూర్ణము.

---

త్యాగరాజస్వామి చరిత్రమునందలి

# కృతుల అకారాదిసూచి

---

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౩ | ౯ | రనువర్షంబుల | రనుతర్షంబుల |
| ౨౨ | ౧౦ | నేర్పిన | నేర్చిన |
| ౩౭ | తుదిపంక్తి | కానీకృతుల్ | లానీకృతుల్ |
| ౪౦ | ౫ | వెలర్చి న | వెలర్చిన |
| ౬౪ | ౮ | ధరాధరాం | ధరాభారాం |
| ౬౮ | ౧౫ | పరిచార | పరివార |
| ౯౩ | ౧౩ | నం బక | నంబక |
| ౯౫ | ౧౪ | బడగ | బతగ |
| ౧౦౬ | ౫ | దనువు౯ | దనుపు౯ |
| ౧౩౦ | ౧౫ | మట్టి | మట్టు |
| ౧౫౭ | ౯ | జత | జడ |
| ౧౫౯ | ౯ | కృతకశ్మాఘు | కృతఘోరాఘు |

# ఆంధ్ర గ్రంథమాల

నెం. 7, తంబుశెట్టి వీథి, మద్రాసు.

---

ఆంధ్రాభ్యుదయమునకు వాఙ్మయాభ్యుదయమును, తన్మూలమునను విజ్ఞానాభ్యుదయమును సాధనంబు లనువిషయము సర్వత్ర తెలిసియున్నది. ఆంధ్రాభ్యుదయమునకు దేశమునందు గ్రంథమండలులు, గ్రంథాలయములు, కళాప్రదర్శనములు మొదలగు సంస్థాపనలు పర్యాప్తంబులై యున్నవి. శ్రీయుత కే. వి. లక్ష్మణరావుగా రారంభించిన యాంధ్రవిజ్ఞానచంద్రికాగ్రంథమాల నేడు శాఖోపశాఖలతో భిన్నరూపముల వెలయుచున్నది. గ్రంథమాల లన్నియు యథాశక్తిని వాఙ్మయాభివృద్ధికి పాటుపడుచున్నవి. ఆంధ్రమాత నలంకరించుచున్న గ్రంథమాలలం దిది యొకటిగ నుండగలదను విశ్వాసముతో నీప్రయత్నమారంభమైనది. ఈ గ్రంథమాలయందు విజ్ఞానాభ్యుదయమునకు సాధనములై వివిధవిషయములకు సంబంధించిన గ్రంథములు రెండుమాసముల కొకగ్రంథమునంతున ప్రచురింపబడును. ఆంధ్రమహాజను లీ ప్రయత్నమును బోషించుటకు ప్రార్థితులు.

## వెలువడిన గ్రంథములు

1. శతకమంజరి (భక్తిసంపుటము):—వృషాధిప, సర్వేశ్వర, దేవకీనందన, నారాయణ, కాళహస్తీశ్వరాదిశతకములు పదియిందుగలవు. ఒక్కొక్కశతకమునకు పీఠికయు, పాఠభేదములు గలవు. (ఈశతకములు విడిగను దొరకును.) ౧-౪-౦

2. బసవపురాణము (ద్విపద):— పాల్కురికి సోమనాథుడు. అనేకతాళపత్రమాతృకలను బరిశీలించి కూర్చిన

మూలము. పాఠభేదములు సూచింపబడినవి. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వ్రాసిన విపులమగు టీక గలదు. రు ౨-౮-౦

3. గాంధిమహాత్ముని బెల్గాము కాంగ్రెసు అధ్యక్షోపన్యాసము:— రు ౦-౪-౦

4. కమలాక్షి (చిన్ని విచిత్రకథ):—రాయసం వెంకట శివుడుగారు రు ౦-౮-౦

5. నీతినిధి:—వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. మానవ జీవిత నిబంధనము లిందు సూటిగావివరింపబడినవి. రెండువేలయేండ్లకు పూర్వ మొక భారతీయబ్రాహ్మణునిచే రచియింపబడినది దీని మూలము. ఇట్టి యుత్కృష్టనీతిగ్రంథ మాంధ్రగీర్వాణవాఙ్మయముల గానరాదు. ౧-౮-౦

## వెలువడనున్న గ్రంథములు

6. జీర్ణవిజయనగర చరిత్రము:—కుందూరి ఈశ్వర దత్తుగారు, బి. ఏ. కృష్ణదేవరాయల సామ్రాజ్యలక్ష్మీపీఠమగు విద్యానగరము (హంపిశిథిలముల) యొక్క ప్రాచీనచరిత్రము, ప్రకృత జీర్ణస్థితియు నిందు వర్ణితములైనవి.

7. త్యాగరాజస్వామిచరిత్రము-(పద్యకావ్యము) శ్రీ పసుమర్తి కృష్ణమూర్తిశాస్త్రి గారు. శ్రీరామభక్తాగ్రణియు, గాయకశిఖామణియు నగు శ్రీత్యాగరాజుగారి చరిత్ర మిందు సరసముగ వర్ణింపబడినది. సందర్భానుసారముగ త్యాగరాజుగారు రచించిన కృతులు ౨౫ నిందు జేర్పబడినవి. ౦-౧౦-౦

కాశీనాథుని నాగేశ్వరరావు,
వ్యవస్థాపకుడు.

ఆంధ్రపత్రికా కార్యాలయమున దొరకు

# గ్రంథములు

రాష్ట్రభాషాహిందీప్రథమ పుస్తకము-రామానందశర్మగారు ౧-౩-౦
శ్రీరామవిజయము (నాటకము)—కే. వెంకటరమణరావు ౦-౨-౦
శారదాంబ, (స్త్రీధర్మబోధిని) నాటకము—టి. శ్రీనివాస రాఘవాచార్యులుగారు ... ... ౦-౪-౦
శబ్దకౌముది (నిఘంటువు)—శిరోభూషణము వేంకటరంగాచార్యులుగారు ... ... ౧-౪-౦
ఆంధ్రోద్యమము—మొదటిఅయిదుఆంధ్రమహాజనసభలఅధ్యక్షులఉపన్యాసములు,తీర్మానములు,చిత్రములుగలవు౧-౨-౦
ఆరాధనవిధి—ముదిగొండ నాగలింగశాస్త్రి గారు ... ౦-౪-౦
ఆత్మజిజ్ఞాసాసంఘము—పారనంది జగన్నాథస్వామి. శరీరమువిడిచిన తరువాత ఆత్మస్థితినిగూర్చి చెప్పునది ౦-౨-౦
సత్యవత్యుపాఖ్యానము—మల్లంపల్లిమల్లికార్జునశాస్త్రిగారు; ఆ. ౨, రసవత్ప్రబంధము ... ... ౧-౦-౦
గురుబోధామృతము (వేదసారగ్రంథము) కట్టమంచి తిరుమలమ్మగారు; భక్తిరసపరిపూరితములగుపాటలు... ౦-౪-౦
తిలకుమహాశయునిజీవితము, సంపూర్ణోపన్యాసములు—మానికొండ సత్యనారాయణ శాస్త్రిగారు ... ౨-౪-౦
తత్త్వచంద్రిక (ప్రథమభాగము)—సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు ... ... ౧-౦-౦
సంగీత శమంతకమణి ... ... ౦-౨-౦
ఆంధ్రశబ్దచింతామణి (సటీకము) పారనంది రామశాస్త్రి౦-౧౨-౦
మహర్షి దేవేంద్రనాథ ఠాకూరుగారి స్వీయచరిత్రము—మొక్కపాటి రామమూర్తిగారు. ప్రేదస్పైట్టుకాగితము. పుటలు ౩౧౪, కాలికో బైండు. ౨-౨-౦
శ్యామాసుందరము (నవల) — ఒంతల సత్యనాథము గారు. నలువదేండ్లకుపూర్వ మాంధ్రదేశమును కలవరపరచిన రంపయుద్ధమునకు సంబంధించిన కథ హృదయంగమముగ వర్ణింపఁబడినవది. ... ... ౧-౦-౮

చారిష్టరు పార్వతీశం (భా. ౧)—మొక్కపాటి నరసింహ
శాస్త్రిగారు (సాహితీసమితి) ... ౧—౭—౦
రామదాసు నాటకము ... ... ౦—౧౦—౦
గాలవఋషి నాటకము ... ... ౦—౧౨—౦
మనశ్శరీరములపై పరిసరముల ప్రభావము ... ౦—౧౨—౦
శతకకవుల చరిత్ర—వంగూరి సుబ్బారావుగారు ... ౩—౯—౦
కవిత్వతత్త్వవిచారము ... ... ౨—౮—౦
ఆంధ్రసర్వకళాశాల విద్యాప్రవృత్తి ... ... ౦—౫—౦
హిందీతెలుగు నిఘంటువు — పంచాగ్నుల ఆదినారాయణ
శాస్త్రిగారు (జేబులో నిముడునది) ... ౧—౦—౦
హిందీ మొదటివాచకము „ „ ... ౦—౬—౦
హిందీ బాలశిక్ష „ „ ... ౦—౬—౦
శ్రీవృషాధిపశతకము—పాలకురికి సోమనారాధ్యులు ౦—౨—౬
సర్వేశ్వర శతకము—యథావాక్కుల అన్నమయ్య ... ౦—౩—౦
దేవకీనందన శతకము ... ... ౦—౩—౦
ఒంటిమిట్టరఘువీరశతకము-అయ్యలరాజు త్రిపురాంతకుడు ౦—౨—౦
నారాయణశతకము ... ... ౦—౩—౦
కాళహస్తీశ్వర శతకము ... ... ౦—౪—౦
దాశరథిశతకము-కంచర్ల గోపకవి ... ... ౦—౩—౦
రంగశాయి శతకము ... ... ... ౦—౨—౦
శ్రీరామతారకశతకము ... ... ౦—౩—౦
రామచంద్రశతకము-పైడిపాటి వెంకటనృసింహకవి... ౦—౨—౦
సకలనీతిసమ్మతము ... ... ౦—౮—౦
అవిమారకము ... ... ... ౦—౧౦—౯
నవచోళచరిత్ర (ద్విపద) ... ... ౦—౧౨—౦
ఏకభాషాలిపి ప్రశంస ... ... ౦—౫—౦

(పోస్టుఖర్చులు ప్రత్యేకము)

ఆంధ్రపత్రికా కార్యాలయము, 7, తంబుశెట్టివీథి, మద్రాసు.

అ. కనులకు నీ సొగసెంతో
కమ్మియున్నది; గనుక

చ. నీదుకథలు వీనులందు నిండియున్నది రామ
శ్రీద నీ నామము నోటఁ జెలగియున్నది గనుక
నేను ఎచటజూచినను నీవైయున్నది రామ
భానువంశతిలక! నీదు భక్తుఁ డనుచు పేరు గనుక.
కపటమా మాటలెల్ల కమ్మనైనది నాదు
తపముయొక్క ఫలము నీవే త్యాగరాజసన్నుత.

శ్రీరామభక్తి

త్యాగరాజస్వామి శ్రీరామభక్తిపరవశులై పాడినకృతులు శ్రీరామభక్తులకు భక్తిరసావేశమును గలుగజేయుచున్నవి. ఆంధ్రహృదయేశ్వరుడైన శ్రీరామమూర్తి త్యాగరాజునకు ఇష్టదైవము. వాల్మీకి మునిపుంగవుడు కావ్యరూపమున మనోహరముగ రామాయణమునందు ప్రత్యక్షము చేసిన శ్రీరామచరితమును త్యాగరాజస్వామి గానరూపమున కృతులందు ప్రత్యక్షముచేసి పండితపామరులకు శ్రీరామభజనానందమును సులభసాధ్యము చేసెను.

ప. ఏపనికో జన్మించితి నని న
న్నెంచవలదు, శ్రీరామ! నే

అ. శ్రీపతి! శ్రీరామచంద్ర!
చిత్తమునకు తెలియదా?

చ. వాల్మీకాదిమునులు నరులు
వర్ణించిరి నా యాశాదీరునా?
మేల్మియైయుండును, సద్భక్తులు
మెచ్చుదురే? త్యాగరాజనుత!

వాల్మీకి కవిబ్రహ్మ; త్యాగరాజు గాయక బ్రహ్మ. ఆంధ్ర భక్తిహృదయము, ఆంధ్రభాషా మాధుర్యము, ఆంధ్రకావ్యరసామృతము, ఆంధ్రగానా నందమును త్యాగరాజకృతులం దేకస్థాయియందు సమ్మేళనమును బొంది బ్రహ్మానందమును గలుగజేయు చున్నవి. త్యాగరాజకృతులు రసరాగభావభరితములై నాదబ్రహ్మానందమును గలుగజేయుచున్నవి.

నాదోపాసనము—బ్రహ్మానందము

బ్రహ్మానందానుభవమునకు రసరాగలయబద్ధమైన నాదోపాసనము పరమసాధనముగ నున్నది.

ప. నాదోపాసనచేసే
శంకరనారాయణవిధులు వెలసిరి; ఓ మనసా!

అ. వేదోద్ధరులు, వేదాతీతులు,
విశ్వమెల్ల నిండియుండెడి వారలు.

చ. మంత్రాత్ములు యంత్ర తంత్రాత్ములు మఱి
మంత్రము లన్ని గలవారలు,
తంత్రీ లయ స్వరరాగ విలోలులు,
త్యాగరాజ వంద్యులు స్వతంత్రులు.

విశ్వావృతమైన పంచవింశతితత్త్వములును శ్రుతిరాగ లయబద్ధములై విశ్వశ్రుతియందు సమ్మేళనమును బొందు చున్నవి. సృష్టిక్రమమునం దాకాశతత్త్వ మవ్యక్తస్థితిని దెలుపుచున్నది. నిర్గుణమైన ఆకాశతత్త్వము సగుణమైన స్వరరూపమున బోధ్యమగుచున్నది. అనంతమైన యాకాశతత్త్వము అనంతశయనుని మాహాత్మ్యమును నాదరూపమున వ్యక్తముచేయుచున్నది. నాదము బిందుకళారూపపరిణామమును బొందుచు స్వరరాగసాహిత్య స్వరూపములను వ్యక్తమగుచున్నది. అఖండమైననాదము శబ్దస్పర్శరూపరసగంధావస్థలందు నాదప్రభావమును కర్మేంద్రియములకును, జ్ఞానేంద్రియములకును వ్యక్తము చేయుచున్నది.

ప. నాదలోలుఁడై బ్రహ్మా
నంద మందవే; మనసా!

అ. స్వాదు ఫలప్రద సప్త
స్వర రాగ నిచయ సహిత

చ. హరిహరాత్మ భూసురపతి
శరజన్మ గణేశాది
వర మౌను లుపాసించిన
ధర త్యాగరాజ వినుత!

ఓంకారప్రభావ మనిర్వాచ్యము. నాదబ్రహ్మోపాసకు లఖండమైన నాదప్రభావమును స్వరరాగ

లయబద్ధమైన గానరూపమున విశ్వమునకు ప్రత్యక్షము చేసి బ్రహ్మానందమును గలుగజేయుచున్నారు. నారదుని తుంబురునాదము ముల్లోకములను పాలించుచున్నది. శ్రీ కృష్ణుని మురళీగానము విశ్వశ్రుతిని మేళవించి విశ్వము నంతను బ్రహ్మానందపరవశము చేయుచున్నది. గానరస ము విశ్వమును బ్రహ్మానందపరవశము చేయగలవిధమును నిత్యానుభవము విశదముచేయుచున్నది. పశువులు, పక్షు లు,మృగములు,పండితులు పామరులు,శిశువులు,వృద్ధులు, స్త్రీలు పురుషులు గానరసాస్వాదనమును జేయుచు పర మానందము ననుభవించుచున్నారు. గాయకబ్రహ్మ రచి యించిన కృతు లాంధ్రహృదయరంజకములైన భక్తిరస మును, గానామృతమును,కావ్యానందమును కురిపించుచు బరమానందమును గలుగజేయుచున్నవి.

ప. రాగరత్నమాలికచే రంజిల్లునట హరి శత.

అ. బాగసేవించి సకల భాగ్య మొందుదాము రారే.

చ. నైగమ షట్శాస్త్రపురాణాగమార్థసహితమట
యోగివరులు యానందమునొందెడు సన్మార్గమట
భాగవతోత్తములుగూడి పాడెడి కీర్తనములట
త్యాగరాజుకడతేర తారకమనిచేసిన శత.

ఈభావమె గ్రంథమునం దిటులు వర్ణింపబడినవి:-

చ. కలుషము లార్చు నూతన వికాసముఁ గూర్చు యశంబుఁ బేర్చు వా
క్కులనఁ దనర్చు మేటి యుపకార మొనర్చు నమర్చుభక్తి ము

క్తులఁ బసిబాల సర్పములకున్ రసపుష్టిని గల్గఁజేయు శ
క్తులఁ దనరారు గానమునకున్ మఱియొక్కటి సాటి గానమే.

గానము–భక్తియోగము

మానవులు చతుర్విధపురుషార్థములను సాధించుటకు భక్తియోగము ప్రశస్తమైన సాధనముగ నున్నది. ధర్మార్థకామమోక్షములను బడయుటకు భక్తియోగముత్తమసాధనము. పితృభక్తి, దేశభక్తి, దైవభక్తి ధర్మార్థకామములకును మోక్షమునకును సాధనంబులుగనున్నవి. అనన్యమైన భక్తి విశ్వరూపసందర్శనమునకు సాధనమని భాగవతోత్తముల యనుభవము విశదము చేయుచున్నది.

శ్లో. భక్త్యాత్వ నన్యయాశక్య ఒహమేవం విధోఽర్జున!
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప!

చిత్తము వృత్తినుండి మరలి భక్తిరసానందము ననుభవించుటకు గానము హృద్యమైన సాధనముగ నున్నది. కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, అంతఃకరణచతుష్టయము ఏకస్థాయియం దాత్మానుసంధానమును బొంది బ్రహ్మానందానుభవము గలుగుటకు గానము సులభసాధనముగ నున్నది. వాక్కు, శ్రోత్రము, చిత్తము గానమునం దేకస్థాయిని బొందుచు భక్తియోగానుభవము సులభసాధ్య మగుచున్నది. సాహిత్యము,

స్వరము, భావము గానమునందు సుశ్రుతిబద్ధములై భక్తి యోగానందమును గలుగజేయుచున్నవి. గానయోగము భక్తి యోగానందమునకును, విశ్వశ్రుతియందాత్మాను సంధానమునకును సాధనంబుగ నున్నది. విశ్వమునందు సుశ్రుతి నిరతిశయానందమునకును, అపశ్రుతి దుఃఖమునకును మూలము లగుచున్నవి. త్యాగరాజు నాదోపాసన చేయుచు రామబ్రహ్మభక్తి యోగానందము ననుభవించిన విధమును కృతులు వెల్లడిచేయుచున్నవి. గాన మఖండమైన భక్తియోగపరమైనపుడు బ్రహ్మానందమును, కామయోగపరమైనపుడు దుఃఖమును గలుగజేసెడివిధమును త్యాగరాజకృతులు మనోహరముగ బోధించుచున్నవి.

ప. రామభక్తి సామ్రాజ్య
మే మానవుల కబ్బెనో? మనసా!

అ. ఆ మానవుల సందర్శన
మత్యంత బ్రహ్మానందమే.

చ. ఈలాగని వివరింపలేను
చాలా స్వానుభవవేద్యమే
లీలా సృష్ట జగత్త్రయములో
కోలాహల త్యాగరాజనుతుఁడగు.

త్యాగరాజు–గాయకబ్రహ్మ

త్యాగరాజు రచియించిన కృతులు సంగీతమునకును కర్ణాటకగానమునకును ఆంధ్రసంగీతమునకును

ప్రతిభను సమకూర్చినవి. బీజరూపమున నపరిచితముగ నున్న రాగములకు స్వరసాహిత్యస్వరూపములను గల్పించి రాగములను సువ్యక్తము చేసిన గాయకబ్రహ్మ త్యాగరాజు. స్వల్పమైన భేదములుగల రాగములకును సాంకర్యదోషము గలుగకుండను శుద్ధరూపములను నిర్మించి గానకళ కపూర్వమైన ప్రతిభను త్యాగరాజు గల్పించి మహత్త్వమును బడయగలిగెను. పాటల యందును కీర్తనలయందును సాంకర్యబీజరూపమునను వాడుకయందున్న రాగములు త్యాగరాజకృతులయందు ప్రస్తారమునుబొంది సాహిత్యస్వరూపమును దాల్చినవి. శృంగారకామకీర్తనలపరమై యధోగతిపాలైన సంగీతము త్యాగరాజకృతులయందు భగవద్భక్తిపరమై యున్నత స్థానము నధిష్ఠించినది. వేశ్యాంగనలపాలైన గానము భాగవతోత్తములవశ మైనది. నీచాశ్రయమువలనను నిందాపాత్రమైన సంగీతము మహదాశ్రయమును బొంది పూజాపాత్రమైనది. త్యాగరాజు సాహిత్యసంగీతమునకును, భక్తిగానమునకును, భావరాగమునకును తన కృతులయందు పరమార్థయోగమును గల్పించి సంసార ప్రవృత్తియందు పురుషార్థమును సుఖారాధ్యము చేసిన ధన్యాత్ముడు. ఆంధ్రహృదయ వైభవమునకు లక్ష్యమైన

త్యాగరాజగానామృతమును నాంధ్రులు సేవించి ఆత్మ వికాసమునుబొంది చరితార్థు లగుదురుగాక!

తేటతెలుగుమాటలు, మధురరాగములు, సరళభావములు త్యాగరాజకృతుల కనిర్వచనీయమైన మాహాత్మ్యమును గాయకభక్తబృందావనమునందు సమకూర్చుచున్నవి. మహానుభావుడైన త్యాగరాజస్వామి చరిత్రము సుహృద్యముగ పసుమర్తి కృష్ణమూర్తిశాస్త్రిగారు రచియించి ఆంధ్రలోకమున కుపకృతిని జేసిరి.

త్యాగరాజచరిత్రము

చ. చదివినవాఁడు శాస్త్రముల సార మెఱింగినవాఁడు బాల్యమం
దొదవెను రామభక్తి యిటులుండఁగ నిప్పుడు గాన విద్యయం
దదిర నిరంకుశప్రతిభుఁడై తగఁ దోఁచెను! పూర్వపుణ్యసం
పద యిది యిట్టివాఁడు భగవానుఁడుగాని మనుష్యమాత్రుఁడా?

త్యాగరాజచరిత్రమునందు మూడుభాగములు గలవు. మొదటిభాగమునందు వంశము, విద్యాభ్యాసము, గురుకటాక్షము మొదలగు విషయములును రెండవభాగమునందు తీర్థయాత్రాదులును, మూడవభాగమునందు శ్రీరామపాదారవిందములను సేవించుచు సంసారయాత్రను జేసిన విధమును గలవు. గోదావరీతీరవాసుడు కాకర్లనగ రాజబ్రహ్మము స్వస్థలమును విడిచి చోళమండలమునందలి పంచనదక్షేత్రమునందు నివాసమును గైకొనెను.

ఆవంశమునందు రామభక్తుడు రామబ్రహ్మము జనించెను. రామబ్రహ్మమునకును శాంతమ్మకును,జప్యేశుడు, త్యాగరాజు పుట్టిరి. జప్యేశుడు మూర్ఖుడు. త్యాగరాజు సుగుణసంపన్నుడైన శ్రీరామభక్తుడు. త్యాగరాజు ధనదారసుతాదుల వ్యామోహమునందు జిక్కుకొనక రాజయోగియై జీవయాత్రను శ్రీరామార్పితము చేసినవిధము గ్రంథమునందు మనోహరముగ వర్ణింపబడినది.

గ్రంథకర్త విషయవర్ణనము నందు సందర్భానుసారముగ త్యాగరాజకృతులను జేర్చి భావపరిస్ఫుటమును బాగుగజేయగలిగెను. త్యాగరాజు పోతరాజు వలెను ధనమునకై రాజాశ్రయమును నిరసించిన మహానుభావుడు. తంజావూరిరాజు పిలుపును నిరాకరించి

ప. "నిధి చాలసుఖమా? రాముని స
న్నిధి సేవ సుఖమా?
నిజముగబల్కు మనసా"

అ. దధి నవనీత క్షీరములు రుచియో? దాశ
రథి ధ్యాన భజన సుధారసము రుచియో?

చ. దమశమమను గంగాస్నానము సుఖమా? క
ర్దమ దుర్విషయకూప స్నానము సుఖమా?
మమత బంధనయుత నరస్తుతి సుఖమా?
సుమతి త్యాగరాజనుతుని కీర్తన సుఖమా?

అనుకృతిని రచియించెను. ఆభావమే గ్రంథమునందలి పద్యములందు గలదు.

చ. పిలిచినవాఁడు మేటి పృథివీపతి యద్దిర సంతసించి యీఁ
దలఁచిన లక్షలిచ్చు నెరదాత రసజ్ఞుఁడు నట్టివాని యా
పిలుపు నిరాకరించి తన విశ్రుతనామము సార్థకంబుగాఁ
జెలఁగిన యిట్టివాఁడె కద సిద్ధవివేకి విరాగి జోగియుక్.

శ్రీరామవిగ్రహములను జప్యేశుడు కావేరియందు పారవేసినపుడు వానిని వెదుకుచు పాడినకృతు లద్భుతమైన భక్తిరసావేశమును గలుగజేయుచున్నవి. త్యాగరాజ స్వామి నోటినుండి వెడలినమాటలు సుస్వరరాగలయ బద్ధములై కృతిరూపమును దాల్చినవి.

ప. "చనితోడి తేవే ఓమనసా!

అ. కనికరముతోఁ గనికరమిడి చిర
కాలముసుఖ మనుభవింప వేగమె.

చ. పతితుల బ్రోచు పట్టాధికారిని
పరమార్థ మత విశ్వాసనుసారిని
ద్యుతి నిర్జితశత శంబరారిని
ధురీణ త్యాగరాజ హృచ్చారిని.

ఈకృతిలోనిభావము నీక్రిందిపద్యము పరిస్ఫుటము చేయుచున్నది.

స. మనసా వేచని తోడితె మిమ్మపుడె పద్మానాభు లేకున్న, నీ కును నా కింతటితోడఁ దీజె మఱి సంకోచింప కేనాఁడు వా నినిఁ గీర్తింపఁగడంగినాఁడ నపుడే నిన్గూడ నిర్జించినాఁ డను ముప్పాతిక లింక నిట్టియెడఁ గూడ న్నిన్ను పేక్షింతువా ?

విగతజీవుండైన బ్రాహ్మణునకు ప్రాణదానమును జేయుటకు జేసిన శ్రీరామ స్తవము గాయకులకు హృదయ రంజకమై మనోహరముగ నున్నది.

ప. భజనపరుల కేల దండ
-పాణిభయము మనసా రామ.

అ. అజ రుద్ర సురేశుల కా
ధ్యాస్థాన మొసంగు రామ.

చ. అండకోట్ల నిండిన కో
దండపాణి ముఖమును హృ
త్పుండరీకమును జూచి
పూజ సల్పుచు.

నిండు ప్రేమతోఁ గరంగు
నిష్కాములకు మన వే
దండపాల దాసుఁడైన
త్యాగరాజు సేయు రామ.

ఈకృతియందలి భావములను సవిస్తరముగను కృష్ణమూర్తిశాస్త్రిగారు గ్రంథమునందు వర్ణించిరి.

మ. తులసీదామము కంఠసీమను, విభూతుల్ నిత్యముండాల్చు జా
తలు ఫాలంబునఁ, గావిదోవతి కటిఁ, దబ్బాటునం జెప్పవే
జలజాతాక్షపదారవిందభజనాసక్తుండు నిష్కామ ని
ర్మలచిత్తుం డితఁడంచు మిత్తిభయ మమ్మా, యేటికే వీనికిన్.

త్యాగరాజు తనకృతుల నప్రయత్నముగను శ్రీరామభక్తిప్రేరితుడై రచియించిన విధమును తేటమాటలు గాఢమైన భక్తి మధురరాగములు వెల్లడిచేయుచున్నవి.

ప. దాశరథీ నీఋణముదీర్ప నాతరమా?
పరమపావననామ.

అ. ఆశదీర దూరదేశములను
ప్రకాశింపజేసిన రసికశిరోమణి.

చ. భక్తి లేని కవిజాలవరేణ్యులు
భావ మెఱుగలేరని కలిలోజని
భుక్తి ముక్తిగల్గునని కీర్తనముల
బోధించిన త్యాగరాజ కరార్చిత.

* * * *

ప. మోసబోకు వినివే, సత్సహ
వాసము విడవకే.

అ. దాసజనార్తిహరుని, శ్రీరాముని,
వాసన హృదయనివాసుని తెలియక.

చ. అల్పాశ్రమమున గల్గు వెసనములు
కల్పాంతరమైన బోదు; శేష
తల్ప శయనుని నెఱనమ్మిన సం
కల్ప, మెల్ల నీడేరును; మనసా!

ధన తరుణుల కాసించు నడల్ల
వెనుక తనువు కలచచే గాని
మనసుచేత సేవ్యుని దలచిన సు
మనసత్వము నొసగునే, మనసా!

గౌరవహీన ధనికులఁ గాచుటయు
నేరముల కెడ మాను గాని,
గారవించు త్యాగరాజ హృదయా
గారుని, లోకాధారునిఁ, దలచక.

ఉ. చూడకయుండ లేను భవశోషణ, నీ నగుమోము చందురుం
బాడకయుండ లేను మృదుభాషణ, నీవిలసద్గుణంబులం
గూడకయుండ లేను రఘుకుంజర, నీపదపద్మభక్తులన్
వేఁడెద రమ్ము కంటఁబడి వేదురనొందెడు నన్నుఁ బ్రోవుమా.

మ. ధరణిం భూతముఁజేసి ము 'న్నఖిలభూతాన్యాత్మవ' త్తంచు నా
చరితార్థుండగు బుద్ధదేవుఁ డురు సంసారాబ్ధి పోతంబుగాఁ
బరగెం గాదె జితేంద్రియత్వమున ధీభావ్యంపు తత్కీర్తులన్
దరమే చెప్పఁగ భోగివల్లభున కుద్దామ ప్రసంగంబులన్.

ఉ. రామకథాసుధానిధి తరంగ సమాహితచిత్తనీరజా
తామలభూతులెల్లెడల నభ్యుదయప్రతిపాదనక్రియా
భూమములై చెలంగుచు నభోగతిఁ బర్వుచునుండ నంతటన్
గ్రామముఖంబుఁ బెట్టుచు సుఖంబుగ నచ్చటివారి వీడ్కొనెన్.

ఉ. రామనృపాల, నే జనకరాజును నీకొకకన్నె నిచ్చి నీ
ప్రేముడిఁ జూరకొంటకు? నభీష్టుతమై యలరారుచున్న నీ
నామము రేయియుం బవలు నాక జపించుచు నున్న పేద న
న్నేమిటి కన్నియుం దెలిసి యిట్టుల నట్టెల బెట్టుచుంటివో.

గ్రంథమంతయును శ్రీరామభక్తిరసభరితమై లోకోక్తులతోను, వేదపురాణేతిహాసోక్తులతోను సమ్మిళితమై భగవద్భక్తులకు పఠనయోగ్యముగ నున్నది. గ్రంథశైలి సరళముగ నున్నది. పద్యములు సహజప్రవాహము గలిగి అలంకారశోభితములై హృద్యముగ నున్నవి. గాయకబ్రహ్మ త్యాగరాజస్వామిచరిత్రమును శ్రీరామభక్తిని మేళవించి పసుమర్తి కృష్ణమూర్తి శాస్త్రిగారు రచియించిన కృతి గాయకులకును, శ్రీరామభక్తులకును, సామాన్యులకును పఠనయోగ్యముగ నున్నది. ఆంధ్ర పాఠకవర్గ మీకృతికి స్వాగతమొసంగి త్యాగరాజు పాడినటులు శ్రీరాముని సేవించి సత్సహవాసముచేసి కామితార్థములను బడయుచు గ్రంథకర్త ప్రయత్నములను సఫలము జేయుటకు దోడ్పడుగాక!

ప్రభవ సం. ఆషాఢ
శు. దశమి శనివారము
చెన్నపురి

కా. నాగేశ్వరరావు.

---

